# వింత పెండ్లి

రచన

శ్రీ యస్. వి. సుబ్బారావు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా.1882) రాజమండ్రి.

# వింత పెండ్లి

## 1

బొంబాయినగర పరిసర ప్రాంతమందొక గ్రామమున నొక పురుషపుంగవుడు బజారువెంబడి పోవుచుండెను. అట్లు పోవుచు, పదిగజముల దూరము పోవుసరికొక కారణముచే నతడచ్చట నాగి మాట్లాడి పోవుదమనెడి యూహచే గాబోలు నాగెను. వెంటనే యాతడు గృహాభిముఖుడై లోనికేతెంచి "దాదాజీగారింటియందున్నారా?" యని ప్రశ్నించెను. పరిచారకుడు లోనికరిగి "అయ్యా! తమ దర్శనార్థమై యెవరో బ్రాహ్మణుడు ద్వారముకడ వేచియున్నా" డనెను. తోడనే దాదాజీ వచ్చి వానిని తగు విధమున సత్కరించెను.

అంత "అయ్యా! తమ పేరేమి! తమ నివాసమెక్కడ?" అని దాదాజీ యడిగెను.

"నన్ను రాఘవశాస్త్రు లందురు. నా నివాసము మందారవతి" యని బ్రాహ్మణుడు తానువచ్చిన పనియంతయు సవిస్తరముగ జెప్పెను.

దాదాజీ యెంతయు జాలిగొని "పరోపకారార్థ మిదం శరీర" మ్మని తనకు తోచిన దేదియో తాంబూలమున బెట్టి యిచ్చెను. ఆ బ్రాహ్మణుడును మిక్కిలి సంతసించి దాదాజీవద్ద నుండి శలవు గైకొని పయనము సాగించెను.

ఈ వచ్చినజాడ గాంచిన ప్రతివారు నాతడొక యాచకుడని గ్రహింపకపోరు. ఆతడొక తెల్లని గోరంచు ధోవతిని బిళ్లగోచీ బెట్టి పయినొక శాలువను వల్లెవాటుగా ధరించి యుండెను. ఎన్ని విభూతిపండ్లు జితుకగొట్టెనో గాని యాతని నుదుటిపయి విభూతి పెండికట్లు స్ఫుటముగా గన్పట్టుచుండెను. తలపై గోష్పాదమంతటి జుట్టుముడిగలదు. ఆతని కుడిచేతియం దొక చెంబును, యంగవస్త్రమును తప్ప తదితర మేదియు నాతనివద్ద గానవచ్చుటలేదు. అత డట్లు పోయి పోయి యొక సత్రమున బసచేసెను.

అందు యాత్రికులకు దగిన భోజనవసతి గలిగియున్నను, నేమి కారణముననో గాని యిందు విశ్రమింప నేతెంచిన బాటసారు లంతగా గనుపింపరు. రాజమార్గమును జేరియుంటచే మార్గాయాసమును భరింపజాలని యాత్రికుల కప్పుడప్పు డచట విశ్రమింప దటస్థించుచుండును. వారలయినను రాత్రియందచట విడియించుటలేదు. కాని యీ సత్రపు స్థితి నెరుంగని యమాయకపు జను లప్పుడప్పుడు నిశాసమయములందు సైతము నిలువ సాహసించుచుందురు. సత్రపు యావరణ మాకాశము నొరయుచున్న ప్రహరీగోడచే బరివేష్టింపబడియున్నది. ఆవరణ మునకు వెనుకతట్టున వెలుపలనుండి లోనికి వచ్చుటకు, లోనుండి వెలుపలకుపోవుటకు చిన్నద్వార మొకటి యమర్పబడి యున్నది. కాని యిది యెల్లప్పుడు బీగముతో బంధింపబడి యుండును.

అచ్చట నా సత్రపు యజమాని నడిగి తమ స్వయంపాకమునకు గావలసిన సరుకులను తీసికొని వంటజేసి సుఖముగా

భుజించి మన బాటసారి పరుండెను. లేచుసరికి సాయంకాల మగుటచే రాత్రి యచ్చటనే బసజేయ నిశ్చయించుకొనెను.

దివాకరుడు పవలెల్ల కష్టపడుటచే శ్రమనంది స్నానము జేయబోవు తెరంగున పశ్చిమాంబుధిం గ్రుంకెను. సంజకెంజాయ వెల్లెడల కర్వ్యాజొచ్చెను. అది శుక్లపక్షమగుటచే చంద్రుడు తారకా గణంబుల నడుమ నభోవీధిపై నలంకరించి తన నిజ కిరణములచే ప్రపంచమునకు తా జేయగలిగిన యుపకారము జేయుచుండెను. కాని అయ్యది జారచోరులకు మిక్కుటముగు బాధ గలిగించుచుండెను.

రాత్రి సుమారు పండ్రెండుగంటలైనది. నిశాకరు డస్తమించువేళ గావచ్చినది. అస్తమయ మయినతోడనే నల్దిక్కుల చీకటు లలముకొనెను. మన బ్రాహ్మణునకు పరధ్యల మయిన కారణముచేతనో మరేమో కంటిపై కునుకు లేదు. కొంతసేపటికి కెవరో కొందరు గుసగుసలాడుచు సత్రమున బ్రవేశించిరి. వారు దీర్ఘకాయులుగను, నల్లగను, కరముల కృపాణముల ధరించియుంటను మన బ్రాహ్మణుడు జూచెను.

బ్రాహ్మణునకు మీది ప్రాణము లెగయునంతటి భయముచే గజగజ వణకిపోవుచుండెను. నోట మరి మాట రాలేదు. వచ్చినచోరులు హుంకరించుచు సత్రపు యజమానుని యావదాస్తియు దోచి హింసించిరి.

ఈ బ్రాహ్మణునిమాత్రము వారు చూడకపోలేదు. ఈతనివద్దనున్న చెంబును, శాలువాయును బలవంతమున నూడ బెరికికొని పలాయనమైరి. సత్రమున బరుండిన బాపనయ్య

వెరగంది నదిమొదలు నిదురవోక ప్రాణముల నరచేతియం దిడికొని క్షణమొక యుగముగా గడపుచుండెను.

రాత్రి సుమారు నాలుగు గంటలైనది. నిదురవోవు కార్మిక కర్షకులారా! లెండు లెండని గాబోలు కోళ్లు పదేపదే కూయమొదలిడెను. వాయస తండములు తమపిల్లల కాహారార్ధ మయి తమ నెలవులవీడి కావుకావుమని నల్దిశల బోజొచ్చెను.

పక్షులు కిలకిలారావములు జేయసాగెను. తూర్పు తెలతెలవారుచుండెను. కర్షకులు తమ పొలముల కేగుచుండిరి. జనసంచారము కొద్దికొద్దిగా సాగుచున్నతరి మన బ్రాహ్మణుడు లేచి "బ్రతికియుండిన బలుసుకూర నైనను తినవచ్చు" ననెడి యాసతో తన ప్రయాణమును సాగించెను.

## 2

బొంబాయినగరమునకు సుమారు పదునేను మైళ్ల దూరమున కల్యాణ కటకమను పల్లెగలదు. అయ్యది తృణకాష్ఠ జలసమృద్ధి గలదియై మిగుల వాసయోగ్యంబై యలరారుచుండెను. అందు దాదాజీ గారను గొప్ప కుటుంబీకుడు గలడు.

దాదాజీగారిదొక నాలుగంతస్తుల మేడ. క్రింది భాగమున లోపలి చావడియందు గోడయంతయు నిలువుటద్ద ములతో నమర్పబడియున్నది. అదంతయు చలువరాతితో పరువబడియుండెను. ఈ విశాల భవనమున రెండవయంతస్తున చిత్రవిచిత్రములగుపటము లమర్పబడియున్నవి. అందు వరుసగా

శ్రీమహావిష్ణుని దశావతారములు, నందనోద్యానమునందలి మందార తరుషండమున గంధుకక్రీడ సలుపు జగన్మోహిని, తుమ్మెదబాధ నసనయించు నెపంబున జనుదెంచిన దుష్యంతుని మనోహరరూప సందర్శనమున వెరగుపడి నిలుచున్న శకుంతల, హంస సందేశము నత్యాదరమున నాలకించు చున్న దమయంతి, యాకాశయానమున బోవుచు నేకావళి నెపంబున వెనుదిరిగి సానురాగంబుగ పురూరవుం జూచుచు నాగిన యూర్వశి, యిత్యాది చిత్రరూపములు పెక్కు వర్ణములతో లిఖింపబడి యందు పొందుపరుపబడెను.

చావడికి కుడివైపున నొక సందుగుండ బోయినచో ఫర్లాంగు దూరము బోవునర కొక యుద్యానవనము కానవచ్చును. అది కడు విశాలమైనదై, సకలపుష్పజాతుల చేతను, నానావిధ ఫల పుష్పములచేతను శోభాయమానంబై విరాజిల్లుచుండును. పడమటివైపున నొక కుల్లాయి నేర్పాటుజేసిరి. ఇక సౌధమువద్దకు పోయినయెడల రెండవయంతస్థు యంతయు రకరకములగు కుర్చీలు, బల్లలు, తివాసీలతోను యలంకరింపబడియున్నది.

అయ్యది దాదాజీయొక్క స్నేహితులుగాని, బంధువులు గాని వచ్చునవారు కులాసాగా కాలక్షేపముచేయుట కలంకరింప బడియున్నది. మూడవ యంతస్థున దాదాజీగారి పడకగది. అందొక యినుపబోషాణమును, దాదాజీగారితండ్రి సంపాదించిన గ్రంథరాజము లలంకరింపబడిన బీరువాలును గలవు. దాదాజీ గారి యాస్తి సుమారు అయిదారులక్షల రూప్యము లుండును. ధనికుడైన కారణముచే నతడు జీవయాత్రను సౌఖ్యంగా గడుప నెంచి సర్వసౌఖ్యములను తన మేడయందు గల్పించుకొనెను.

విద్యుద్దీపములు రాత్రియంతయు వెలుగుచుండును. విద్యుత్ వీవనలు ప్రతి యంతస్థునందును నమర్పబడియున్నవి. చివరకు మేడపైయంతస్థునకు గూడ నీరు గొంపోవు కుళ్లాయిలు గలవు. బాటసారు లెవరైన విడిదికై వచ్చిన క్రిందిభాగమున చావడి కెడమవైపుననున్న గదులయందు బసనిచ్చును. ఇట్టి యేర్పాటులతో యాతని హర్మ్యము నలరారుచున్నది.

దాదాజీ భార్యపేరు సుశీల. ఈమె సద్గుణ ఖని. ఓర్పు యందీమె భూదేవి సమురాలు. చుట్టపక్కాలను, యతిథులను యాదరించుటయందీమె యద్వితీయురాలు. పతి మాట కెన్నడును జవదాటి యెరుంగని పరమ పతివ్రత. సమస్త భాగ్యములతో నలరారుచున్నను, యీ దంపతులను పిల్లలు లేని విచార మెల్లప్పుడును బాధించుచుండెను. ప్రతి నిత్యమును లక్ష్మిపూజ సేయును.

ఎవరే వ్రతము జెప్పిన యా వ్రతమును జేయుచుండెను. నిరతాన్న దానములు యెన్ని జేసిన నేమి? ఎన్ని సంపదలున్న నేమి? "అపుత్రస్య గతిర్నాస్థిః" యను దానిని జ్ఞాపకము చేసుకుని విచారించుచుండెడిది. ఇట్లు కొంతకాలము జరిగిన తరువాత యీ దంపతులకు భగవదనుగ్రహముచే నొక ముద్దుల మూటగట్టు యాడశిశువు గలిగెను. ఆమెకు ఇందిరాదేవి యని నామకరణము జేసిరి.

ఇందిర దినదిన ప్రవర్ధమానయై తల్లిదండ్రుల తన ముద్దు మాటలచే నానందాబ్ధి నోలలాడించుచుండెను. పంచవర్ష ప్రాయముననే యిందిర కక్షరాభ్యాస మొనర్చిరి. గురువుయం దతి గారాబములతో మెలగుచు యిందిర పది సంవత్సరముల

ప్రాయముననే యయిదవతరగతి వరకును చదివెను. తరువాత యిందిర పౌరుగూరువెళ్లి చదువుకొనవలసి యుండుటచే దాదాజీ యామెను తన స్వంత మోటారులో నిత్యము బొంబాయి పట్టణము పంపించి చదివించుచుండెను. ఇప్పుడీమె షోడశవర్ష ప్రాయమై యుండెను.

ఆమె నవయౌవన విలాసిని యన్నంతమాత్రమున దృప్తిలేదు. అవయవవర్ణనమును యథారూపమున బోధించుట మసాధ్యము. కామినులకు బ్రాయమే సుందరమైనది. జవ్వనము మెరుగులకు దొలుకారువంటిది. నెరజవ్వనమున విలసిల్లు నా యువతీమణి నెమ్మేని నిగ్గులు పవన చంచలితంబులగు జల తరంగములం దొలుకారు చలించు చంద్రకిరణములవలె మిల మిల మెరయుచుండెను.

ఆమె విలాస చేష్టితముల కవధి లేదు. ఒక్క క్షణమైన యూరకుండదు. పయ్యెద సవరించుకొనుచుండును. కంకణముల కదలించుచుండును. అటునిటు సవిలాసముగ జూచుచు ఆమె ముఖచంద్రమండలము చిరునవ్వు వెన్నెలల నొకక్షణమును విడిచి యుండలేదు. ఆమె నవ్వుచున్నప్పుడు నునుజెక్కుల జిన్నిగుంట లెంతో రమణీయముగ నుండును. వేయేల! ఇందిర భూలోక సుందరియే యనవచ్చును. పురాణవిద్యయేగాక సంగీత సాహిత్య ములం దసమాన పాండిత్యగరిమ సంపత్తిగల బాల.

బొంబాయి పట్టణమున స్కూలుఫైనలు పరీక్షయం దుత్తీర్ణ యయినది. అప్పటికి యీమె నడిజవ్వనమున నున్నది. స్కూలునందు చదువురోజులలో నారాయణరావు యను విద్యార్థి నొకని ప్రేమించియుండెను, అతడును యీమెను ప్రేమించెను.

## 3

బొంబాయి కాగ్నేయమున యిరువదిమైళ్ల దూరమున నొక చిన్న పట్టణము గలదు. అదియే మందారవతి. ఆ గ్రామము సకల సంపదలతోను, పాడిపంటలతోను, నద్వితీయమయి యుండెను. అందు సుమారు ముప్పది నలుబది బ్రాహ్మణ కుటుంబములు గలవు. లక్ష్మీపుత్రులగు వైశ్యులుగూడ చాల మంది యాయూర గలరు. అచ్చటినుండి పరిసరగ్రామములకు సరకులన్నియు నెగుమతి చేయబడుచుండెను.

పదేండ్లక్రితమొక బ్రాహ్మణుడాయూరుజేరి నలువురను మంచి జేసికొని మందారవతియందొక బ్రాహ్మణగృహమున భార్యాపుత్రులతో కాలము గడుపుచుండెను.

యీ బ్రాహ్మణుడు చర స్థిరాస్థి లేనివాడగుటచే యేపూటకాపూట యాచనజేసి దారాపుత్రాదుల నుదరపోషణ జేయుచుండెను. ఈతని పేరు రాఘవశాస్త్రి. యీతనికి ముగ్గు రాడుపిల్లలును, యొక మగబిడ్డయు గలడు. పిల్లవాడే యందరి కన్న జ్యేష్టుడు. పన్నెండవయేట గ్రామస్థుల యాదరణ పాత్రుడయి కొలదికొలది చందాలను ప్రోవుజేసుకొని మందారవతి యందే పురాణవిద్యాభ్యాసమునకు గడంగెను.

అట్లు నాలుగు సంవత్సరములలో మందారవతియందలి చదువును పూర్తిజేసి, యుపాధ్యాయుల మన్ననల బడసి, వారి యొద్దనుండి కొన్ని యోగ్యతాపత్రముల దీసుకొని, బొంబాయి

నగరము చేరెను. అచ్చట కొందరి పరిచయము సంపాదించి "గవర్నమెంటు స్కాలరుషిప్పు"నకై తనకు క్రితము సంవత్సరము వచ్చిన మార్కులతో దరఖాస్తుబెట్టెను. దొరతనము వారు యీతనికి యుచిత వేతనమిచ్చి మిగుల ప్రోత్సహించిరి.

మూడు సంవత్సరములు బొంబాయినగరమున విద్యాభ్యాస మొనర్చెను. మూడేండ్లును దొరతనమువారిచే యుచిత వేతనము బొందెను. ప్రతి వేసంగి శెలవులయందు సుందారవతి కేగి, యచ్చటి గ్రామవాసులచే చందాలను స్వీకరించి యా డబ్బుతో తన యుదరపోషణము జరుపుకొనెడివాడు. బొంబాయి నగరమున స్కూలుఫయినల్ పరీక్ష పూర్తియయినది.

విద్యాభ్యాస మొనర్చుటకన్న యేదేని యుద్యోగము సంపాదించి, తన తల్లిదండ్రుల బోషించు బాధ్యత తనయందున్నదని భావించెను.

ఈతడే మన నారాయణరావు. ఇందిరా మానసచోరుడు ఈతడు నేలిమి బంగారు చాయగల శరీరముగలవాడు. సమదీర్ఘ కాయమును, యంగసౌష్ఠవము గలిగి కోమలుల మనంబుల హరింపగల మోహనమూర్తి.

## 4

బొంబాయి రాజధాని కుత్తర భాగమంతయు దట్టమగు అడవులచే నిండియున్నది. అయ్యది వింధ్య, సాత్పురా పర్వత ప్రదేశముల నడుమను, చుట్టునుగలదు. అందు పాడలు పల్లెపల్లెగ

నల్లుకొని పాంథులకు నడువ వీలులేకుండెను. అందలిచెట్లు కను పొడుగయినవయి, సూర్యకిరణములు క్రిందబడనీయనంత దట్టముగా వ్యాపించియుండెను.

అందు క్రూరమృగ సంతానంబులు, వ్యాఘ్రములు, చిరుతలు, కరులు, సింగంబులు, ఖడ్గమృగములు మొదలగు భయంకర జంతువులును, లేళ్ళు దుప్పులు మొదలగు సాధు మృగ శాలంబులును గూడ నివసించుచుండెను. ఆ నిర్జనారణ్యమున మానవుడొంటిగ పయనముసాగించిన యే క్రూరమృగము నోటనో బడవలసినదే. అందుచే సాధారణముగా జనులు గుంపులు గుంపులుగా ప్రయాణము జేసి సాయంకాలమగుసరి కొక పరిసరగ్రామము చేరి విశ్రమించుచుందురు.

ఈ కాననమందు క్రూరమృగ సంజనితమగు భయమే గాక చోరులభయ మెక్కువగానుండెను. ఏపులి నోటనుండియో దప్పించుకొని బ్రతికిన యెవరికు చోరులచేత బడుట తప్పదు.

అట్టిచెరి యిరువురు వ్యక్తులు ప్రయాణము జేయుచుండిరి. వారు దుర్గమమగు వనమున బ్రవేశించుటచే, తమ గుర్రము లను డిగ్గి నడుచుట దుస్సాధ్యమగుటచే ముండ్లపొదలను, పుట్టలను తప్పించుకొనుచు నెమ్మదిగా నడచుచుండిరి.

ఆ యరణ్యమున నుండు దొంగలెవరు నొక గూఢమగు ప్రదేశమున తమ నివాసమేర్పరచుకొని ఏపొదచాటునుండియో మనుష్యభాషణ వినవచ్చిన తోడనే వారిపయిబడి హింసించి వారి సొత్తునెల్ల గ్రహించి తుదకు వారిని కాళికా సదనంబున బలి యిచ్చుచుందురు. ఈనరహత్యలు, దొంగతనములు మాన్ప దొరతనమువారు పోలీసు శాఖోద్యోగుల గొందరను నియ

మించిరి. కాని యొక్కొక్కరి వారిని సయితము లెక్కగొనక తమ కరవాలంబుల కెందరినో యెరజేసిరి.

అట్లు బాటసారులు కొంత దవ్వేగిన వెంటనే యొవడో యొకడు కృపాణమును ధరించి పొదమాటునుండి తటాలున ముందు కురికెను. గుఱ్ఱములు బెదరి ముందుకడుగిడవాయెను. ఆ వికృతాకారుని జూచినతోడనే బాటసారులు భయపడక వానిని మెల్లగా నిట్లు పలుకరించెను:

బాటసారి: ఓయీ! నీ వెవడవు?

చోరుడు: ఎవడనయిన నీకేమి. మీ రెచ్చటినుండి వచ్చుచున్నారో తెల్పుడు?

బా: తెల్పకున్న?

బాటసారులలో రెండవవ్యక్తి మొదటివానికి కనుసైగ జేసి చోరునిపై నకాత్తుగాబడి నరుకి నంకించెను. చోరుడును సిద్ధముగ నుండుటచే వెంటనే కత్తిదూసి రెండవ బాటసారుని నరుకబోయెను. వారిద్దరును గూడ యుద్ధసన్నద్ధులై యుంటచే చాలసేపు యుద్ధముచేసిరి. తుదకు చోరు డొక్కడగుటచే నలసటజెంది యుద్ధము జేయలేక తన శక్తి కొలది కొమ్ము నూదెను.

తోడనే దొంగలు కాలకింకరులభాతి మందిపడుచు జేత కరవాలములు దాల్చి యా బాటసారుల నిరువుర ముట్టడించిరి. బాటసారులు వేరొండుపాయము లేమి నిశ్చేష్టులై కీలుబొమ్మలవలె వారెట్లు చెప్పిన నట్లు జేయజొచ్చిరి.

ఔరా! చోరులీ బాటసారుల రెక్కలు విరచికట్టి కొట్టి తమ రేనికడకు గొంపోయి వాని యాజ్ఞానుసారము వారిని పాతాళ గృహమున బడవైచిరి.

16

# 5

నారాయణరావు పంపిన దరఖాస్తునకు వారము దినములలో తిరిగి జవాబు జేరినది. జాబు చేరినతోడనే నారాయణరావునకు పట్టరాని సంతోషము వచ్చెను. కవరును విప్పి చదువుకొనెను. తనకై ఒక ఖాళీ యుంచినట్లును, వారము దినములలో తాను నియమిత స్థానమునకు జేరవలసినట్లును యుండెను.

తానెచ్చోటికైనను బోనుద్యుక్తుడై యున్న హేతువుచే మిగుల సంతోషాంతస్స్వాంతుడై యుండెను.

ఇది యిట్లుండ మరునాడు మరొక కవరును తపాల్ బంట్రోతు తీసుకవచ్చి "నారాయణరావుగా"రని ప్రశ్నించెను. నారాయణుడా జాబందుకొని దాని నామూలాగ్రముగా జదివి పట్టరాని సంతోషమును, విచారమునుగూడ నభినయించెను. దానియందిట్లున్నది:

మనోహరుడగు నారాయణుని దివ్యపాదపద్మములకు,

నేను పాఠశాల విడిచినదాదిగా నిన్ను ధ్యానింపని నిమిషమే లేదు. సతతము నీ నామోచ్ఛారణ చేయుచు యెప్పుడు నీకు నాయందు దయ గలిగి నన్ను పరిణయమాడెదవో యని 'స్వాతి వానకు ముత్తెపుచిప్ప తెరచునట్లు' నిగరు జూచుచుంటిని. ఎప్పుడు నీ నిరూప సందర్శన భాగ్యము బ్బునో యని నా నయనాంబుజంబులు కాయలు గాచు చున్నవి. నా మది నీయందు దృఢముగా నాటినది. అబల యని నిరాకరింతువేమో! నేను నిన్నే గాక వన్యుని వివాహమాడనని ప్రమాణముగా తెలియజేయుచున్నాను.

ఇట్లు నీ ప్రియమనోహారిణి,

కల్యాణకటకము

ఇందిర.

ఈ కమ్మను వ్రాసిన యా కొమ్మ స్థితి నొక్కు... విచారించి నిట్టూర్పు విడిచి నేనేడ, యిందిరను పెండ్లాడు టేడ! నావంటి దరిద్ర నారాయణునకు నా పెతండ్రి వివాహము సేయునా? కల్ల. నన్నుతక్క తదన్యుని పరిగ్రహించదట. నాకును యామెకును వివాహంబెట్లు సమకూడును! ఆమెయో నొక కోటీశ్వరుని కొమరిత. దాదాజీ ఈ విషయము విన్నంత నిరాకరించి తన మేనల్లుడగు కేశవరావునకిచ్చి తప్పక పెండ్లి జేయును.

అట్లు జేయునపుడు యిందిర యిష్టపడక నసువుల విడచు నేమో యని భయముగుచున్నది. కాని యమ్మ నేగు విధమున నామెకు సమాధానము జెప్పకున్న నేమి ప్రమాదము వాటిల్ల గలదో యని యాతడొక జాబు యిందిరకు వ్రాసెను.

మాతాపితల కుద్యోగ విషయము నివేదింపబోయెను. తమ దుస్థితిలో దైవము ఘనమగు నుపకారము జేసినందులకు కడు సంతసించుచు బీద బ్రాహ్మణుడు తమ కష్టములు గట్టెక్కి సుఖించు కాలము వచ్చెగాబోలునని యపరిమితానందమును బొందెను. నారాయణుడు తల్లిదండ్రులకడ శలవు గైకొని బొంబాయి ... రము జేరెను.

నచ్చి చారియుండే రామ్‌నాధ్ యను తన ప్రాణ నెచ్చెలిని జూచి యాతనితో తన బసకు జేరెను.

రామ్‌నాధ్, నారాయణుల ప్రాణములు వేరుగాని, మనుష్యులొకటిగుటచే వారిలో నొకరికొకరెట్టి రహస్యము లున్నను జెప్పుకొనక యుండరు. అందుచే నారాయణుడు యిందిర తనను

మోహించి పెండ్లాడనిశ్చయించిన తెరంగుగూడ సవిస్తరముగా జెప్పెను. అందుపై రామ్‌నాథ్ మిగుల సంతోషించి యా విషయమున తగు నేర్పాటు తాను జేయుదునని వాగ్దానము జేసెను.

నారాయణుడు మిత్రు లందరను విడువక తప్పనిసరి యగుటచే మనంబున గుందుచు నెట్టకేలకు శలవు గైకొని తాను సబ్ యినస్పెక్టరు పరీక్షకు నియమిత స్థానమునకు వెడలి పోయెను.

## 6

బొంబాయినగరమున "టెంపిల్ స్ట్రీటు" నందున్న రెండస్థుల మేడ విష్ణుమూర్తిగారిది. ఈయన మంచి యుదార స్వభావముగల సద్బ్రాహ్మణుడు. కొంచము దీర్ఘముగను, స్థూలముగనుండును. ఎక్కువ ధన మార్జించకపోయినను, పిత్రార్జితము సుమారు పదివేల రూప్యములుగలవు. నానితో వడ్డీవ్యాపారము జేయుచు సుఖముగ కాలము గడుపుచుండెను.

ఈయన భార్యపేరు మాణిక్యాంబ. నిజముగ యీామె సద్గుణగరిమ. మాణిక్యము వోలె ప్రకాశించుచుండెననుట కతిశయోక్తిగాదు. చుట్టపక్కాలను మిక్కిలి గౌరవించి, తాను గౌరవమునన్ను పొందుచుండెను. వీరు కాపురమున్న మేడ విష్ణుమూర్తిగారి తండ్రి కట్టించినదే. క్రింది హాలునందు యెడమ భాగముల సద్దికు యచ్చిరి

మిగతభాగమంతయు విష్ణుమూర్తిగారి యధీనముననే యున్నది. మధ్యహాలునందు చక్కని పటములు పలురంగులతో లిఖింపబడి గోడపై కనుపడుచుండును. మరియు ననేక పటములు గూడ గోడకు వ్రేలాడబడి హాలున కెంతో యందము నొనగూర్చుచుండెను.

విష్ణుమూర్తిగారికి మాణిక్యాంబల కిరువురు సంతానము గలదు. ఒక కుమార్తెయు, నొక కుమారుడునుగలరు. కుమార్తె పేరు సుశీల. ఈమె యిప్పటికి సుమారు పదియేండ్లనుండి యాగ్రామమున గాపురము జేయుచుండెను. కుమారుని రామ్‌నాథ్ యని పిలతురు. ఈతడు తలిదండ్రుల గారాబు బిడ్డడు. భయభక్తులుగల యువకుడు.

ఈతని కిప్పటికి సుమారు యిరువదియొక్క వత్సరము లుండును. మిక్కిలి రూపసి గాకపోయినను, సుకుమార సుందర గాత్రుడు. చామనిచాయ మేను, ఆతని దుస్తుల రీతియు, ముంగురుల తీరును గమనించిన నాతడు పాశ్చాత్య నాగరికత నామోదించువాడని గ్రహింపవచ్చును. చిన్ననాటి నుండియు పితృవాక్య పరిపాలన దప్పి యెరుంగడు.

బొంబాయి నగరమున స్కూలుఫైనలు పరీక్షయందు తీర్ణుడై, విశ్వవిద్యాలయమున యింటర్మీడియేట్ ప్రథమ సంవత్సరము చదువుచుండెను. ఈతనికిని నారాయణరావునకును ప్రాణస్నేహము. ఒండొరుల నెప్పుడును విడచియుండెడివారు కారు. వీరిద్దరిని జూచిన ప్రతివారును రామలక్ష్మణులా యని భ్రమించెడివారు.

పరుండినప్పుడు, చదువుకొనునప్పుడు, పాఠశాల కేగు నప్పుడు, వేయేల! సర్వకాల సర్వావస్థలయందును మనుజుని నీడ వెంబడించురీతి కలసి మెలసి యుండిరి. రామ్‌నాథ్ నారాయణునకు తన స్వగృహముననే పై యంతస్థునందొకగది ఖాళీజేసి బసకు యిచ్చెను. కష్ట సుఖములను సమముగా పంచు కొనుచు కాలమును బుచ్చుచుండెడివారు.

నారాయణరావు స్కూలుఫైనలు పూర్తిజేసి మందార వతి జేరెను. రామ్‌నాథ్ విశ్వవిద్యాలయమున ప్రవేశించెను. నారాయణు డెప్పుడు బొంబాయి వచ్చినను బస రామ్‌నాథ్ యింటనే.

## 7

ఒకనాటి సాయంతరమున యిందిర యొంటిగ నుద్యానవనమున కేతెంచెను. ఆ వనమున పల్లవితంబులు, కుసుమితంబులు, ఫలితంబులు నగు పొన్నలు, పొగడలు, గోరింటలు, చేమంతులు, మూతంబులు, జాజులు, విరజాజులు, మల్లెలు, మొల్లలు, పోకలు మొదలగు తరులతానికరంబుల సుమంబుల గోసి విరిగుత్తుల పూలచెండ్లు గుచ్చుచు, నొక యిసుక తిన్నెపై సుఖాసీనయై ప్రస్తుత ప్రాపంచిక వ్యవహారముల దలపోయజొచ్చెను.

మలయమారుతము వింజామరలు వీచుచుండెనో యన సెలయేటి పయినుండి చల్లని పిల్ల తెమ్మెరలు వీచుచుండెను. ఆహా! యేమి! ఈ వివిధవర్ణన. వికసిత పరిమళ బహుపుష్ప శోభిత దామము! ఎంత మనోజ్ఞమయి యలరారుచున్నది. ప్రకృతి సౌందర్యమే

సందర్శనము. ఆదిశేషునికైనను వర్ణింప నతీతమై యుండును. ఎట్టి కృత్రిమ సౌందర్యమైనను సహజసౌందర్య మంద మనోహ్లాదకరమై నయనాంబుజంబులకు వెలయింపజాలునే?

ఆ...... మరచితిని...... నా ప్రాణ ప్రియుడు వ్రాసిన జాబు......అనుచు మొలలోనుండి కవరునువిప్పి లోని లేఖను మొదలంట చివరవరకు ముమ్మారు చదివెను. ఆమెకు మనస్సునందేమో కలవరము పుట్టినట్లుగా తోచినది. నారాయణుడు తన నుద్వాహము జేసికొనడను భయముచే గాబోలు, సింగంపు బారినుండి దాటిన యాడులేడి రీతిగా గడగడ వడకుచుండెను.

అంతలో ధైర్యము తెచ్చుకొని నారాయణుని దివ్య విగ్రహ మొకించుక మనస్సున దలపోసి, ఏమీ! నీ స్వరూప లావణ్య వైభవము. గీర్వాణాంధ్ర కవితా పితామహులు సౌందర్యముండని కులసి జయంతి వసంత నలకూబర మన్మధాదు లను వర్ణింతురు. వారిని నీ వెన్నడును తీసిపోవని నే దలంతును. అట్టివాని నీ పొందు కూడని నీ యాశ్లేషసౌఖ్యముండని నా జీవిత మేల కాల్పనా?

నారాయణా! అల్ప సౌందర్యవతినగు నేనెక్కడ? మందభాగ్యనగు నాకు నీ దర్శన మెన్నటికైన గలుగునా? నీవు నా చిత్త సామ్రాజ్యంబు నేలు చక్రవర్తివి.

నీకే నా చిత్త సామ్రాజ్యాంతిరస్థమగు నా ప్రేమ యను ఖజానాను మనఃపూర్వకముగా సమర్పించుకొంటిని. నీ విప్పట్ల నా కన్నవ కగుపడిన నీ పాదములపైబడి నన్నేలుకొనుమని ప్రార్థింతు. తిరస్కరింతువేమో! అప్పుడే నీ పాదపద్మములకడ నారాయణ నామోచ్చారణతో నా ప్రాణంబుల నీకు సమర్పించుకొందును.

ఇందిర : ఆఁ! ఎవరది?

కేశవ : నేను కేశవరావును. రాగూడదా?

ఇంది : మగువ లుద్యానవన విహారము సేయుతరి మగవారు రావచ్చునా? ఏమి నీ కావరము. నా యాజ్ఞ లేనిదే నీవిందు రాజనదు పొమ్మ్మనలకు.

కేశవ : ఇందిరా! నిన్ను పెండ్లాడు సర్వాధికారము నాకు నీ తండ్రి యిచ్చెను. ఏమి? నారాయణుడా! యెవడు! అంత రూపసి. నాకీ ప్రపంచమున నెచ్చటను గాన్పింపనేలేదే? ధన రూపవంతుడనగు నన్ను పరిణయమాడ సంకోసించెదవేల?

ఇంది : నా యభీష్ట మెట్లో యట్లు జేయు నా తండ్రి నీ కెట్లు నాపై సర్వాధికార మొసంగెను. నే నమ్మజాల. నేను నిన్ను పరిణయమాడుట కలలోనివార్త యని యెరుంగుము. నా మనస్సిదివరకే నొకనియందు లగ్నమై యున్నది. వానిని దప్ప తరన్యుని వివాహమాడనని నే ప్రమాణము జేసియుంటిని. కావున మర్యాదగా వచ్చిన దారి బొమ్ము.

కేశవ : వచ్చినదారి బోవ్వటా? నే బోవుటగూడ నీ వని నట్లు కలలోనివార్తయే! క్రోధములో నీవు నాకిప్పుడు సరియగు సమాధాన మొసంగుము. లేదా! నన్నుగాక మరొకని నెట్లు పరిణయమాడెదవో నూచెద. (అని కౌగలింపబోవును)

ఇందిర భీతచిత్తయై యాతడు తన్ను బలాత్కారము చేయునను భయముచే వెనుకకు తగ్గి కెవ్వున కేక వేసెను. కేశవరావు తటాలున క్రిందబడిన యాకవరును తీసికొని గోడ దూకి పరువెత్తెను.

ఇందిర కేకలు వినిన యాపె చెలికత్తెలు యచ్చోటుకు పరువిడి యామెను విశ్రమింపజేసి, యింటికి గొంపోయిరి.

## 8

రాఘవేంద్రుడు దాదాజీ గారి చెల్లెలిభర్త. రాఘవేంద్రుడు గూడ దాదాజీ నివసించు గ్రామమునందే కాపురముండెను. ఈతడొక సామాన్య కుటుంబీకుడు. సాలునకు సుమారు నాలుగువేల రూప్యము లాదాయమువచ్చు భూవసతియు, సుమారు రెండువేలు ఖరీదుచేయు గృహమును గలవు.

ఈతనికి కేశవరావను కుమారుడొకడుండెను. కేశవుని పంచవర్షప్రాయముననే రాఘవేంద్రుడు కాలమృత్యువాతబడెను. అది మొదలు కేశవుడు గారాబు బిడ్డడై, తల్లి జెప్పిన మాట పెడచెవిని బెట్టి, సరిగా పాఠశాలకైనను బోయెడివాడు గాడు. కాని దాదాజీగారి భయముచే మెల్లగా నాలుగవ పారమువరకు చదువగలిగెను. తరువాత దుర్జన సాంగత్య ఫలితముగా విద్య పూర్తిజేసి, చుట్టపక్కాలను లెక్కగొనక, అన్ని యవినీతులకులోనై తన యావదాస్తిని ధ్వంసముచేయసాగెను.

అంత కేశవునితల్లి యన్నయగు దాదాజీని బ్రతిమలాడి వ్యవహారములు కొంచము జక్కబెట్టవలయుననిగోరుటచే నిపుడు కేశవునిగురించిన బాధ్యత దాదాజీకగుడు. కేశవుడిప్పుడిరువది యేడు వత్సరముల ప్రాయుడు. సాధారణమగు శరీరచ్ఛాయయు, తగుపాటి లావును, పొడుగును గలిగినవ్యక్తి. రూపసంపత్తియందంత రూపసి గాకపోయినను, కురూపిమాత్రము గాడు. గుణావిశేషంబుల సిగ్గ్రాహ్యము సుర్గుణంబుల ఖని యనజెల్లును.

పదునెనిమిది వత్సరములు వచ్చినదాది యీతడు స్త్రీలోలుడై, ధనము చేజిక్కకుంటచే దారిగొట్టుటలు మొదలగు దుర్వ్యసనములకు లోనై తన కులమువారిచేనెల్ల నిందితుడయ్యెను. అందుచేతనే మన యిందిర యీతని నంతగా తూలనాడినది.

కేశవుడు స్వగృహమున తాను పరుండు గదియందు విశ్రమించి యిందిరనుండి దొంగిలించిన కవరును విప్పి యీ రీతిగా చదువదొడగెను.

"యిందిరా!

నీ ప్రియమగు జాబు నిన్నటి దినమున నాకు చేరినది. నీకు నాయెడ యవ్యాజానురాగమున్నట్లు నే నెఱుంగుదును. నాకు నీయందు గాఢమగు ప్రేమ గలదని నమ్ముము. మన యిద్దరకును వివాహము పొసగు టెట్టులని యూహించితివి? వెఱ్ఱిదానా! నీ తండ్రి యైశ్వర్యమునకు కుబేరు డంతటివాడు. నేనా దరిద్రనారాయణుడను

అట్టియెడ నీతండ్రి ముద్దుబిడ్డవగు నిన్ను నాకియ్య నెట్లొప్పుకొనును. ఇంట మేనల్లుడు గలడే! వానికియ్యక నాకిచ్చి పెండ్లిచేయునా? అట్లొకవేళ జరిగెనా నీవును నేనునుగూడ నదృష్టవంతులమే. "లోకులు కాకు లనెడి వాక్యోక్తి నీ వెఱుగవే! ఇంట మేనల్లుడుండ బాయకువాడైన దరిద్రునకిచ్చి వివాహము చేసెనని నీ తండ్రి యపకీర్తి పాలౌనేమో! నేను తిరస్కరించితినని భావింపక భవిష్యత్కష్ట సుఖముల నాలోచించుకొని వీలునుబట్టి మెలగుము.

ఇట్లు నీ ప్రియుడు,
నారాయణరావు.

దీని నామూలాగ్రముగా జదివి నారాయణరావా! వా......ని......ని యిందిర వరించుటా? స్వయంవరమా!

తల్లిదండ్రుల యిష్టములు నేల గూలెనన్నమాట. నా చిన్న నాటినుండియు నా మేనమామ, మేనత్తలు నా కిందిర నిచ్చి వివాహముజేతుమని జెప్పుచుండ యిప్పుడీమె యిష్టముగాబోలు.

సరే. ఆ నారాయణుఁ డెవడో, యెట్లు వివాహమాడునో జూచెద. ఏమి, నేనంత రూపసినిగాదా? నాకు లోటేమిటి? ధనధాన్య సంపన్నుడ గానా? మరే కారణము. కానిమ్ము. నా బొందెలో ప్రాణము లుండుదనుక నారాయణుడు గాడు యీ నిటలాక్షుఁడు వచ్చినను యిందిరను పెండ్లాడజాలడు.

కేశవుడన్న నంత చులకనగా! సామదానభేద దండో పాయంబుల ప్రయత్నించెద. లొంగదూ? అపుడు నాచేత గలదుగదా.........తగు ప్రతిక్రియ. మా తల్లిచే జెప్పించి ప్రయత్నించెదనని సర్వంబు జరిగినది యామెకు తెలియజేసెను.

ఆమెయు మేనరికము దాటిపోవుననెడి భయముచే దాదాజీకి పలుమార్లు విన్నవించెను. అతఁడును సందుల కియ్య కొనెను. కేశవరావుయొక్క దుష్ప్రవర్తన, దుస్సాంగత్యము, దుర్నీతి విషయము లణుమాత్రమయినను దాదాజీకి తెలియవు.

9

"హా మనోహరా! రూపరాజిత
మన్మథాకారా! నారాయణా!

నేను నిరంతరము భవత్పాదారవింద ధ్యానమును జేయుచు, నా పూర్వపుణ్యఫల మెట్లున్నదోయని విచారించి చాటున యశ్రుపులు రాల్చని దొక్క నిమిషమేని లేదు. నన్ను నా తండ్రి తన మేనల్లుడగు కేశవునకిచ్చి పాణిగ్రహణము జేయునట.

కట్టా! ధాత చేత లెంతచోద్యములు. 'తానొకటి తలచిన దైవ మొకటి తలచె' నన్నట్లు నేనేమి అయోగ్యుని, కులహీనుని, విద్యావిహీనుని కోరియుంటినా? మేనరికమట. వరు డెంతటి కురూపి యయినను, కుల, ధన, మానహీనుడైనను తప్పక చేయవలెనట.

ఇట్టి కులాచారముల మాన్పగలవారు లేరా? అయ్యో! పూర్వము మాత్రము స్వయంవరములు లేవా? స్వయంవర మన్నంతమాత్రాన కులహీనుని, గుణహీనుని వరింప నేయింతి యిచ్ఛగొనును. రాణీసంయుక్త తాను స్వయముగా గాదె పృథ్వీరాజును వరించె? దమయంతి, సావిత్రి, యామినీ పూర్ణ తిలక, వాసవదత్త, రాణి దుర్గావతి దేవి మొదలుగాగల వీరమాతలు తమ యిష్టానుసారము వరించి భర్తృపాదారవింద చింతనాయత్తచిత్తలై గాదె సుఖించి తరించిరని మన పురాణేతిహాసములు చాటుచున్నవి.

అట్టిచో నే నేమి తప్పు జేసితిని. దైవఘటన మెట్లున్నదో? దైవమా! నన్ను నా పతి జేర్పు భారము నీపయి మోపితిని. నీటముంతువో పాలముంతువో యనుచు నయ్యిందిరాదేవి వాపోవు చుండెను.

* * * *

సాయంసమయ మగుచుండెను. పవలంతయు నడివీధులం దునుమాడి మిగుల శ్రమనుజెంది రక్తసిక్తమగు శరీరమును స్నానమాడి నిశాకాంతం గూడి సుఖింపవచ్చునని గాబోలు భాను డపరాబ్ధిలో గ్రుంకుచుండెను. వేలుపు తమతమ పనుల కదుపులను దోలుకొని పల్లెములకు జేరుచుండిరి.

శకుంత సంతానంబులు తమతమ కులాయముల జేరి పగలెల్ల పడిన కష్టమునకు విశ్రమించుచున్నవి. దివాకరు డస్తమియగుటంజేసి సంధ్యారాగమును చీకటియు గలసి సిగుణుని దిక్కులందు నీలము కెంపును నతికిన రీతిగ నొప్పి యుండెను.

కల్పద్రుమము మొగ్గలుదొడగినవా యనునట్లు నాకసమందు తారకాగణం బతిశయిల్లి పాంధులకు కొలదిగా మార్గములు జూపుచుండెను. జగత్తునం దంతట కారుమబ్బులు గ్రమ్మినవా యనునట్లు యంధకార మెల్లెడల వ్యాపించెను. కమలాప్తుడు లేమియెడ నేనెంనుకనియో లేక యిందిరాదేవి వియోగావస్థం జూడలేకనో మరేమో కమలంబులు ముకుళించెను.

అట్టితరి దాదాజీ భోజనమునకై లేవనుండెను. దాదాజీ కిందిర యేకపుత్రి యగుటచే నామెయందలి వాత్సల్యమున తన ప్రక్కను గూర్చుండజేసి భుజించుట వాడుక. ఆనాడు ఇందిర కాస్పాపమి షమామె గదియందు వెడలకెను. అచ్చట నామె వేడినిట్టూర్పులు బుచ్చుచు నొక చాపపై బరుండియుండెను.

"అమ్మా! భోజనమునకు వేళయయినది లెమ్ము" అని దాదాజీ యామెను బిలిచెను. వెంటనే యిందిర తండ్రితో గూడ భుజించెను. భోజనమైనతర్వాత దాదాజీ తన పడకగది యందొక కుర్చీపై నాసీనుడై "యిందిర నవయౌవనవతి యగుటచే విరహావస్థం బొందుచున్నది. కావున సత్వరము వివాహములకు తగు ప్రయత్నముల జేయవలయును.

ప్రేయసీ! చిన్ననాటనుండియు కేశవరావు నా యధీనములో నున్నాడు. నే నిదివరలో నా ముద్దుల చెలియలికి వాగ్దానము జేసియుంటిని. కేశవుడు మన ముద్దులపట్టికి తగిన వరుండని తోచుచున్నది. నీ యభిప్రాయమే"మని దాదాజీ తన భార్య నడిగెను.

భార్య: మేనరిక ముండగా మరొకదానికై ప్రయత్నించు టుచితముగాదు. కాని కేశవుని నడవడి జూడ......

దాదాజీ: ఏమది? అతని నడవడికేమి? చదువా! పోనిమ్ము. చదివి సంపాదించువా రెవరు? ఏదో అన్నోదకము లకు లోటులేకుండ నున్న కుటుంబము. మరి తోడబుట్టినవా రెవరు లేరు. అదిగాక మనకు దగ్గరవాడగుటచే మన మాట్లు జెప్పిన నట్లు వినును. ఆ దయామయుడు కరుణించవలెగాని మన ప్రయత్నములో నేమున్నది.

సుశీల: నాథా? మీరు దూర మాలోచించుటలేదు. ధనమా ప్రస్తుత మాతమున్న స్థితినిబట్టి యెంతకాలము వచ్చునో మీరే జెప్పుడు? అర్థము లనిత్యములని మీ రెరుగరా? ప్రస్తుతి మాతని దుర్జనసాంగత్యము మీరు వినలేదా? ధనమున కేమి లెండు. మనకున్నదిచాలదా? ఆ పిల్లను యిచ్చుటకు కొంచెము గుణశీలములు విచారించి తదుపరి మిగత విషయము లాలోచించవలెను.

దాదాజీ: పెండ్లి జేసినపిమ్మట బుద్ధి కుదుటబడగలదని నా నమ్మకము. అయిన మన యిందిర యభీష్ట మెట్లున్నదో నీవు తెలిసికొనుమని జెప్పి రాత్రి ప్రొద్దుబోవుటచే శయనించెను.

# 10

ఒకనాటి ప్రాతఃకాలమున ఇందిర తన ప్రియవయస్యయగు మాలతిం గూడి ప్రమదోద్యానమున విహరించుచు మల్లి, జాజి, విరజాజి మొదలగు లతానికరంబుల సుమంబుల గోయుచు, పరిగుత్తుల నొండొరుల వేయుచు, యొయ్యారముట్టిపడునట్లు మందగమనముచే వనమయూరముల ధిక్కరించుచు, బాలరెమ్మలం వంచుచు, సరసపు టెలుంగులచే మత్తకోకిలల మదంబు లడంచుచు, బుష్పవీథుల నరచుచు, సుమంబుల గోయుచు, గోసిన కుసుమంబుల తమ రొండియందిడి మెలమెల్లగ నొక సహకార వృక్షంబునీడ గట్టబడిన తిన్నెపై విశ్రమించి పయ్యెదలోని సుమంబుల నొక మాలగా గ్రుచ్చుచుండిరి.

మాలతి : సఖీ ! అల్లదె, యా సెలయేటి రాయంచల సమాజము నొకపరి పరీక్షింపుము.

ఇందిర : ఔను తెలిసినది. ఆ యాడు రాయంచ వియోగముచే గాబోలు నొంటిగా నందందు దిరుగాడుచున్నది.

మాల : బాగుగా గ్రహించితివే. ఏమే యిందిరా ! త్రికరణశుద్ధిగా నీవు నారాయణరావును దక్క నన్యుని వివాహమాడవా ! మీ తండ్రికి మేనరికముపయి నెక్కుడుగ మక్కువ గలదని వింటిని.

ఇం : నా మనోభీష్ట మిదివరకే నీకు తెలియజేసితిని. సఖీ మాలతీ ! ఆ వుత్తరదెసగా బోవు బాటసారి యెవరు చెపుమా !

మాల : అతడొక జడదారివలె నున్నాడు. త్రికాల వేదిగా గన్పట్టుచున్నాడు.

ఇం : తీసికొని వచ్చెదననియా యేమి!

మాల : నీ యిచ్ఛయైనచో.........

ఇం : మాలతీ! సాధు సందర్శనము సర్వపాప హరణముగదా సత్వరమ తీసుకొనిరమ్ము.

మాలతి - యా సిద్ధుని కేక వేయుగా వెంటనే యాతడు మారుమాటాడక యిందిర గూర్చుండు స్థలము చేరువకు వచ్చెను. ఇందిర సవినయముగా సాధునకు నమస్కరించెను

సాధు : దీర్ఘాయుష్మమస్తు, మనోవాంఛాఫలసిద్ధిరస్తు, శీఘ్రమే వివాహ ప్రాప్తిరస్తు.

ఇం : మహాత్మా! మిమ్ముజూచ మీ రెవరో తపోధనులని తోచుచున్నది. మీవంటి వారికి సర్వంబు కరతలామలకమయి యుండు. నా కావలసిన యర్థంబు సర్వంబు తెలియజేయు ప్రార్థన. అయ్యది.........

సాధు : ఆ, ఆ, ఆ, గ్రహించితిని. నీ వనుగబోవున దెరుంగుదు. నీవు నారాయణరావను వానిని మనో వాక్కాయముల వరించియుంటివి. నీ తండ్రి మేనకోడ నుండుటచే. కేశవరావునకిచ్చి వివాహముజేయ నిశ్చయకుడై యున్నాడు. నారాయణరావును వివాహమాడగోరిన నీవు ఎన్ని చిక్కుల పాల్గావలసి యుండును.

ఇం : సాధూజీ! ఆ కష్టము లెట్టివో వినవచ్చునా!

సాధు : అబలా! కేశవరావు నీపయి నుసులుగొని యున్నాడు. నీ వతని కోరికను నిరాకరించితివి అందుపయి

నాతడు కోపించి, నిన్నెట్లులయిన పరిణయమాడి తీరవలెనని మిక్కిలి పట్టుదల వహించినాడు. గావున నతనివలన నీకును, నీ తల్లిదండ్రులకునుగూడ పెక్కు యిక్కట్లు వాటిల్లు. అందుచే నా యుద్దేశ్యము; నీవు కేశవునే వివాహమాడిన నంతయు సవ్యముగా జరుగునని జెప్పి సాధువు తన దారిని బోయెను.

ఇం : సఖీ! దైవయోగ మలభ్యముగదా! కాకున్నది గాక మానునా! ప్రొద్దెక్కుచున్నది. వేగము యింటికి పోవలయునని మాలతితో గూడి యింటికి పోయెను.

## 11

వింధ్యసాత్పురా పర్వత ప్రదేశమున తపతీ, నర్మదా, నదులుపుట్టి యవి పడమరగా ప్రవహించి బొంబాయి రాజధానివద్ద నరేబియా మహాసముద్రమున గలియుచున్నది. వర్షములు గురియు ప్రదేశ మగుటంజేసియు. ఉష్ణప్రదేశం బగుటచేతను నచట కారడవులు మిక్కుటముగా గలవు.

ఆ పర్వత ప్రదేశము నానావిధ ఫలవృక్ష సంయుతమై దట్టముగా నల్లుకొనియున్నను. అయ్యది ముండ్లపొదలచేతను, పల్లిబిల్లిగ నల్లుకొనిన తీవెలచేతను నడువ నశక్యమై నిర్జనమై యుండుటచే గండక పుండరీక మాతంగ తురంగ మహిష వరాహ గవయ గంధసింధుర సింహ శలభాది క్రూరమృగ గణ్యంబై కోళ్లు జింకలు మొదలగు సాధుమృగ సంతతిచేతను

నానావిధములగు శకుంత సంతానంబులచేతను నా సిపిన మొప్పియుండెను.

పగటివేళయందైనను సూర్యరశ్మి క్రింద సోకక, కారు చీకటిగా నుండును. దానియందు కొన్ని రహస్యమార్గములు మాత్రము చోరు లేర్పరచుకొనిరి. అవి వారికితప్ప తదితరుల కేమాత్రమును తెలియవు. ఆ కాననమునందు చోరభయ మెక్కు డగుటచే బాటసారులు గుంపులుగుంపులుగా పోవుచుందురు.

కాని వారిని చోరులు ముట్టడించి, కొల్లగొట్టి, తమ కారాగారముల పాల్జేసి తుద కెప్పుడో చండికా సదనంబున బలి యిచ్చుచుందురని మన కీవరకే తెలియును.

వింధ్యపర్వతముల దక్షిణవైపున చోరులు తమ నివాస మేర్పరచుకొనిరి వారచ్చట పెద్ద పాతాళగృహము నొకదానిని నిర్మించిరి. అయ్యది సమస్త కీటకములకును, విష వాయువుల కును నాటపట్టయి, కంటక శిలావృతమైయుండెను. బంధింపబడ్డ పాంథులు దీనియందే దాచబడుదురు. దీనినుండి యడవిలోని యచ్చటచ్చటికి భూమిలోనుండి దారులు గలవు. అయ్యవి చోరులకుమాత్రమే తెలియునుగాని యితరులకు తెలియవు.

ఈ దొంగలకందరకు నాయకుడొకడు గలడు. ఆ నాయకుడు జెప్పినట్లు మిగతవారందరును జేయవలసిన విధి యయియున్నది. ఈ చోరులు కొన్నికొన్ని సమూహములుగా నేర్పడి యరణ్యమునం దంతటను కావలి గాయుచుందురు. అవసరమగుచో వారికిగల సంజ్ఞావిశేషములతో మగొకజట్టును కేక వేయుదురు.

ఆ దొంగలలో నలువు రొకచోట గూర్చుండి యుండి యేమేమో రహస్యముగా సంభాషించుకొనుచుండిరి. సంభాషణ పూర్తియైనతదుపరి నాయకుడు మిగతవారితో "మీరతి జాగ్రతగ మసలవలయును. మనగుట్టు యేమాత్రము తెలిసినను ప్రమాదము వాటిల్లగలదు. భైరవా! జాగ్రత" యనిజెప్పెను.

* * * *

సాయంకాల మగుచుండెను. ఆకాశమున నేనుగును సూర్యకిరణ మాపటీ డస్తాద్రిపై నలలవ్రైచి వెతగుడిచి క్రిక్కిన రక్తమో యనునట్లు సాంధ్యరాగ మొప్పెను. నల్లని గాముక నేలపై పారబోసిరా యనునట్లు కాంతారంబంతయు జీకటిమయ మయ్యె. చీకటు లలముకొను కొలది చోరుల కుత్సాహంబు మెండయ్యె.

రాత్రి సుమారు పదిగంటలు కావచ్చినది. మద్యపానంబు జేసి క్రొత్తగా సానలుదీరిన కొడ్డేయుబులు కేలం గైకొని, నియమింపబడ్డ చోరులు నల్లని దుస్తుల ధరించి, మరొకజేత విద్యుద్దీపమును పట్టుకొనియుండిరి. మొలయందు ప్రతివానికి నొక కైజారు గలదు. వారి యాకారములుజూడ నెట్టి రాతిగుండెవానికైనను భయముత్పాదించును.

ఇట్లా నల్వురును మద్యపాన మదోన్మత్తంబున నత్యుత్సాహముతో బోయి పోయి రాత్రి పన్నెండుగంట లగుసరి కొక సౌధరాజముం బ్రవేశించిరి.

ఈ దొంగలయం దొకడా మేడయందు చిరపరిచితు డగుటచే పరులు ప్రవేశించ దుర్భేద్యమగు సౌధము నవలీల ప్రవేశించిరి. ఆ యింటిలోనివారందరును గాఢనిద్రం దేలి

యుండిరి. అపుడు దొంగలలో నొకడు మిగతవారితో నేదియో గుసగుసలాడి తాను మూడవయంతస్థున కెక్కి బాకి యందు నిద్రించుచున్న యజమానుని జూచెను. మొలనున్న కైజారును దీసి గొట్టములోనుండి యేదియో విషవాయువును బ్రయోగించెను. కొలది నిమిషములలో యతడు స్మృతిదప్పి పడియుండెను.

అంత నిర్విఘ్నముగా నిర్భయముగా నావద్దనగల పలిముట్లచే ధనాగారములు తెరచి అందలి ధనమును సంగ్రహించి, ధనాగారమున కెదురుగా నైపునున్న ద్వారమును తెరచి యందు మెల్లగా బ్రవేశించెను.

పరిమళ మిళిత వాయువులు నలువంకల నమ్మోదించెలు వెదజల్లుచుండ, వినిర్మల సుధాఫేనసదృశమగు పాన్పుపై యొకప్రక్క కొరిగి, నిజహస్తముపై శిరమునుంచి, ద్వితీయ హస్తము నెదపై నుంచుకొని, పసిడి బొమ్మ నపహసించుచు, శిరీషకుసుమ కోమల తన్వంగి యొకర్తు గాఢసుషుప్తి నుండెను. ఇదియే నా ప్రేమను పుట్టించి నా ప్రాణాధారమని చోరుడామెను డాయజేరి నాసికారంధ్రపుటముల నేదియో సీసా నుంచెను.

చంద్రుని వహసించు నెమ్మోముగల యింతి రూపురేఖా విలాసములు మరుక్షణమున కళావిహీనమయ్యెను. చోరుడామెను తన భుజములపై వ్రేలవేసుకొని మెల్లగా మేడమెట్లన్నియు దిగి మిగత చోరులంగలసి తెల్లవారుజామున మూడు గంటలగుసరికి తమ నివాసము జేరిరి.

ఈ అదృష్టవిహీన యెవ్వతెయో చదువరు లీవరకే యూహించి యుందురు. ఈమె మన యిందిరాదేవియే. ఎట్టి

సుకుమార పేశల శరీరము నేనెట్టి కష్టములఁ బాల్గానున్నదో! హాస లీలా విద్రాములందుగూడ నారాయణ నామోచ్చారణచే ప్రొద్దు బుచ్చు నీమె కెట్టి దుర్గవస్థ ప్రాప్తించె.

తెలతెలవారజొచ్చెను. కానన మంతయు సింహ శార్దూలాది క్రూరమృగ గర్జనలచే మారుమ్రోగుచుండెను. మత్తమదేభంబులు ఘీంకరించుచు యరణ్యంబు నంతను కలయ ద్రొక్కుచుండెను.

మర్కటములు వృక్షోపరిభాగంబుల శాఖోపశాఖలపై కుప్పిగంతులిడుచు నాకలములను కనుపార మెక్కుచుండెను. శుకపిక కలరవములు భూనభోంతరాళములు నిండుచుండెను. పక్షిమూకలు తమ ముద్దుపిల్లల గూండ్ల విడచి యిందందు బోవుచుండెను.

అట్టితరి యామె యిందిర వుస్సురనుచు ప్రక్కపై యిట్టట్టు దొర్లి కొలదిసేపటికి స్మృతికివచ్చి కన్నుల దెరచెను. చూచు సరికి ఆమె పరస్థలమున నెచ్చోటనో యున్నట్లు గ్రహించెను. తా నచ్చటి కెట్లు వచ్చెనో, యెవరు తన్నిటకు దోడ్కొని వచ్చిరో, యేమియు తోచక మనస్సాందోళనపడజొచ్చెను

అబల యేమి చేయగలదు. తల్లిదండ్రులను బాసి యొంటిగ పరస్థలమున నెన్నడైన నున్నదా! లేదు లేదు. తేరిపార జూచు సరికి యాగది యంతయు గబ్బిలములు, మూషికములు మొదలగు క్షుద్రజంతువుల కాలవాలమై సాలిగూడ్లతోను, బూజుతోను దట్టముగా నావరించి యుండెను. శల్యములతో నెత్తురు కాల్వలగట్టిన చారలతో దుర్గంధపూరితమై యుండెను.

ఎచ్చటనుండియో కొంచము గాలి వెల్తురులు వచ్చు చుండెను. దానికి ద్వారము న్నదిగాని తెరచుట యెట్లో యామె కేమియు బోధపడ లేదు. అది పాతాళగృహము.

ఆ హేతువుచే యిందిర భయము నందు దేహాయయి "హా తండ్రీ! నన్నెవరో క్రూరులగు చోరులు తస్కరించి నట్టడవియం దుంచిరి. కటకటా! ఎట్టి యాపన్నసముద్రమున మునింగితిని. ఎవడో పాషాణ హృదయుడు. కటిక కర్కసుడు—అబల యని భావింపక—పర స్త్రీ యను యెద దలంపక—గోజాలి వహింపక—లోకనిందకైన భీతిల్లక—నన్నిందుల కేల తెప్పించియుండును?

అయ్యో! కామాంధులైన కుమతులు కన్యాన్యాభంగ మొనర్ప యెట్టిపనికైనను సాహసింతురు. 'కామాతురాణాం న భయం న లజ్జ' యనిగదా నార్యోక్తి. తండ్రీ! చిన్ననాటి నుండియు పుత్రులు లేని కొరతచే నన్నే పుత్రునిగా పుత్రికగా దలంచుచు నల్లారుముద్దుగ బెంచి పెద్దజేసి యిప్పుడీ కర్కశ హృదయుల కప్పగించితివా?

కోకిలా! నీవైనను పోయి పిన్నవయసునుండియు మిగుల గారాబమున బెంచి పెద్దజేసిన మాతాపితలకు నాయీ దురవస్థం దెల్పి బ్రతికియున్న మరల నెప్పటికైనను గన్పింతునన్నదని జెప్పి యూరడిలచేయవా?

ఓ క్రూరమృగములారా! మీరైనను నాపై కినుక లేదా? హా దైవమా! నాకెట్టి యిడుమలపాటు దెచ్చితివి. నన్నీ యాపదనుండి దప్పింప నీవుదక్క నన్యులు లేరు. దయామయా! నన్ను రక్షించుభారము నీపై మోపితి ననుచు నయ్యిందరాదేవి వాపోవుచుండెను.

అపుడొక వృద్ధవనిత యేతెంచి "అమ్మా! నీ ప్రియుడు వచ్చి నిన్ను గారవించువరకు నీవామంచముపై గూర్చుండు" మని చెప్పగా యిందిర పట్టరాని కోపముగలిగి "నా ప్రియు డెవ"డని యడిగెను. "నిన్ను పట్టి తెప్పించిన కేశవరా"వని యామె ప్రత్యుత్తరమిచ్చెను.

"ఓ వృద్ధవనితా! నీవిప్పుడన్న యీ మాటను మరల ప్రేలకు"మని కోపదృష్టితో పలికెను. అంతలో కొందలొకడు వచ్చి యా వృద్ధవనితంగాంచి "కేశవి! జాగరతతో నీయామెయొద్ద జేరి యాదరించుచుండవలసినదని ప్రభువుగారు సెలవిచ్చి"రని చెప్పి వెడలిపోయెను.

## 12

తెల్లవారి క్షేమపరిశీలింతేము గల్లంతుగానుండెను. దాదాజీగారి ఇందిర ఇంట లేదు. ఎవరో దొంగలు ధనమును, పిల్లను గూడ యెత్తుకుపోయిరట యని పల్లెవాండ్రంతట జెప్పుకొనసారంభించిరి.

దాదాజీగారికి యీ వృత్తాంతం దెక్కడను పలుకుబడిగలదు. అందుచే ఆయనకు ప్రాప్తించిన కష్టమునకా గ్రామప్రజలొకరంట తడిబెట్టనివా రొక్కరును లేరు.

ధనాగారము తెరువబడి యుండలి సర్వము హరింపబడెను. ధనధాన్యాదులకంటెను, తన సర్వస్వముకంటెను, తన ప్రాణముకంటెను నమూల్యమగు బాలామణిని పోగొట్టుకొని వందులకు దాదాజీ పెక్కువిధముల దురపిల్లుచుండెను.

"హా ముద్దులబిడ్డా! అల్లారుముద్దుగా పెంచి పెద్దజేసితి నే. నాకు కొడుకులు లేని కొరత లేకుండ నిన్నే నాయనా యని పిలచి సంతసించెడివాడనే.

అట్టి నీ వెచ్చటనుంటివి. నిన్నే దుర్మార్గు డెత్తుకపోయెను. తల్లీ! యెట్టి కష్టముల పొందుచుంటివో. నిన్నా క్రూరు డెత్తుకపోవునపుడు మాకొరకై నెంతగా పరితపించితివోగదా!

హాతల్లీ ఇందిరా! నా ప్రేమపు పెన్నిధానమా! నీవాతని యిష్టంబున నడువనిచో నెన్ని కష్టములకు గురియగుదువో? హంసతూలికా తల్పంబున బరుండి 'అమ్మా! నా శరీర మెంత కందినదే' యను నీవు నే డెట్లు కటిక నేలపై బరుండగలవు? వలసినపుడఖిల ప్రతిపక్ష దుర్భేద్యమగు సలహాల నొసంగెడి దానవే. అమ్మా! నేడు నాకట్టి సలహాల నొసంగువారెవరు?

హా! రాకా శశాంకుని వహించు నీ మోము జూడకున్న నే బ్రతుకజాల. నా వియోగంబుగ నిముషమేని యు భరింప నోపవుకదా యిందిరా! నిన్నుగూర్చి మీ తల్లి యెంతగా విలపించుచున్నదో?" యని దాదాజీ విలపింపసాగెను.

సుశీల: హా నా జీవనమా! నిన్నెవ్వరు పిశాచాధము డెత్తుక పోయెనో? నిన్ను రక్షించువా రొక్కరును లేకపోయిరిగా? నిన్ను వాడెట్టి యిక్కట్టుల బెట్టుచుండెనో?

అమ్మా, యిందిరా! నీవు పెద్దవై మమ్ముల నెప్పుడో నానందాబ్ధినోలలాడించుదువని గంపెడాసతో నుంటిమి. అట్టి నీవు ఆ క్రూరుడు పెట్టు బాధల కోర్వలేక ప్రాణముల బాసితివా? నా ప్రేమ నిధానమా! నన్నిక 'అమ్మా' యని పిలచువారెవరు?

హృదయమా! నీ వింకను కొట్టుకొనుచుంటి వేల? ఏల బ్రద్దలుగావు. పంచ ప్రాణములారా! నా జీవధనము లేనినెడ మీరేల? నన్ను వదలి పొండు. ఓ పంచభూతములారా! నన్ను మీలో గలుపుకొనుడు. ఇందిరా! నాతో నొక్క మాటాడరావా? నొక్క ముద్దియ్యవా? అయ్యో తల్లీ! భరింపజాల భరింపజాల' యని మూర్ఛబడియెను.

దాదాజీ యామెను మూర్ఛదేర్చి "యింతీ! 'ఆపద లందు ధైర్యగుణ'మ్మను నార్యోక్తి నీవు వినలేదా? గనుక గతించినదానికై వగచిన ప్రయోజనము లేదు. ముందు కార్యాలోచన జేయవలయును. గోవింద్! నీవు సత్వరము పోయి పోలీసు సబుయినస్పెక్టరువద్దకు యీ సంగతి నంతయు తెలియజేయుము" అనెను.

గోవిందుడు వెంటనే చురుకైన తురంగము నెక్కి వాయువేగ మనోవేగంబుల బొంబాయి పట్టణంబు జేరి పోలీసు శాఖోద్యోగికి యీవృత్తాంతము జెప్పెను. అంతట పోలీసు సబుయినస్పెక్టరు కొంత పరివారముతో దాదాజీగారి యింటికి వచ్చెను.

యిల్లువాకిలను యాతడు సోదా చేయుగా ఇందిర పడకటింటి యందు బల్లపై నొక సీసా కన్పడినది. దానిని జేబునం దిడుకొని తాను జూచిన యానవాలును, దాదాజీగారు జెప్పిన విషయములును సబినస్పెక్టరు వ్రాసుకొని వెంటనే దాదాజీగారికి తగు ధైర్యము జెప్పి "మీ పిల్లను మీకు క్షేమముగా నప్పగింతుము. కలతపడకు"డని జెప్పి వెడలిపోయెను.

## 13

తెల్లవారెను. తూర్పుదిశనుండి సూర్య కిరణములు తీక్షణముగా ప్రసరింపసాగెను. జన సంచారము వృద్ధిజెందుచుండెను. పని పాట్లులేని సోమరసోదరు లెందరో నిద్రనుండి లేవకపోయినను పనితొందరగలవారు తమతమ కార్యస్థానములకు పోవుచుండిరి. మన పోలీసు సబుయినస్పెక్టరు గూడ పనితొందరచే వేగముగా ద్విచక్రశకటముపై బోవుచుండెను.

పోలీసు సబుయినస్పెక్టరగు హరిహరరావుగారు యీ సంగతిని కార్యాలయమునందు సూపరింటెండెంటుగారితోను, యచిరకాలమునుండి పేరు ప్రఖ్యాతుల బడసినట్టియు, గొప్ప గొప్ప ఖూనీలయందు పరిశోధించి హత్యానేరముల నవలీలబట్టి దొరతనమువారిచే నమూల్యములగు బహుమానములందిన ఛీఫ్ సి. ఐ. డి. యగు మాధవరావుగారితోను తెలియజేసెను.

ఈ మాధవరావుగారు సుమారిప్పటికి యిరువదేండ్లనుండి దొంగలను బట్టి దొరతనమువారి కప్పగించు ప్రజలకనేక యుపకారములు జేయుటచే నందరు నీతని మిక్కిలి గౌరవముగా చూచుచుందురు.

సూపరింటెండెంటుగారితో తాను యీ కేసును గూర్చిన వ్యవహారములు తెలిసికొనుటకై దాదాజీగారి యింటికొకసారి వెళ్లవలయునని చెప్పి పయనమయ్యెను. పిమ్మట మాధవరావు మనోవాయువేగంబైన తురంగంబు నెక్కి బాణమువలె నివ్వెన

బోయి దాదాజీగారి సౌధముకడ హయంబు డిగ్గి "దాదాజీగా రున్నారా!" యని ప్రశ్నించెను. వెంటనే దాదాజీ బయటకు వచ్చి మాధవరావును సత్కరించి లోనికి గొంపోయెను. మాధవరావు దాదాజీలీ క్రిందివిధమున సంభాషించిరి:

మాధవ : దాదాజీ! మీ కెవ్వరిపైన నైన యనుమాన మున్నదా? మీకీవఱకెవ్వరైన విరోధులు గలరా!

దాదా : అయ్యా! నాకీయుంర విరోధులు లేరు. నా కెవ్వరిపైన ననుమానము లేదు. ఆమెను......

మాధ : ఏమది? భయపడక, మీకు తెలిసిన సర్వము విశదీకరింపుము!

దాదా : తోటలో మాలతీ సమేతయై యున్న మా యిందిర విహరించుచుండ నొక జడదారి వారి దృష్టి నాకర్షించెను. అంత మాలతి వానిని పిలువగా వాడరుదెంచి...... నీవొకని వరించియుంటివి. నీ యింటికి నిన్ను మేనరికము చేయ సమకట్టి. నీవందుల కిష్టపడక మరొకనిని వివాహమాడ ప్రయత్నించుచుంటివి. అందువలన నీకును, నీ తలిదండ్రులకును గూడ ముప్పు వాటిల్లు. నీ మనోహరుని వివాహమాడజాలవని జెప్పెనట.

మా : ఇట్లు జరిగినదని మీ కెవరుజెప్పిరి! ఇది జరిగి యెంతకాలమైనది?

దా : సుమారొక పక్షముదినములైనది. మాలతి యను నాపె జెప్పినది.

మా : మేనరిక మున్నదంటిరి. వాని పేరేమి! నివాస మెచ్చట

దా: మా చెల్లెలి కొడుకగు కేశవరావున కీయదలచితిని. అతడీ గ్రామముననే నివసించుచున్నాడు.

మా: అయ్యా! మాలతి నొకసారి యిటకు రప్పించుము. ఆమెను కొన్ని ప్రశ్న లడుగవలసియున్నది.

దాదాజీగారి సేవకుడొకడు మాలతిని తీసుకువచ్చెను. మాలతి మాధవరావునకు నమస్కరించి నిలువబడియుండెను.

మా: అమ్మా! నీ స్నేహితురాలు యిందిర నీవును తోటలో నుండగా నరుదెంచినవ్యక్తి రూపమును కొంచము చెప్పగలవా?

మాలతి: అయ్యా! యతడు సుమారు అయిదున్నర యడుగుల పొడుగుండును. చామనిచాయ మేను, ఎక్కువ రూపసిగాడు. అజానుబాహుడు.

మాధ: యిందిర యెవని వరించెనో నీకు తెలియునా? వాని నివాసమెక్కడ?

మాల: నారాయణరావనువానిని. అతడును మా చెలియు బొంబాయి పట్టణమున చదువుకొన్నారట. అతని నివాసస్థానము బొంబాయి కిరువదిమైళ్లలో నున్న మందారవతి యను గ్రామమని జెప్పెను. నారాయణు నామె ప్రతిజ్ఞాశుద్ధిగా వరించినది.

మాధ: మాలతీ! కేశవుడన్న నిందిరకు ఇష్టము లేకుండు టకు గారణము! భయపడక నీకు తెలిసినది సర్వము జెప్పుము.

మాల: అయ్యా! అతడు స్త్రీలోలుడై, ధనాప హరణము, మానధనాపహరణములు చేయుచుండుటంజేసి యామెని నిరాకరించినది. అతడే యొకనాడు స్వయముగా

యిందిర యొంటరిగ నుద్యానవనమందున్నతరి, మా చెలియను తన్ను వివాహమాడ బలాత్కరించెనట.

దా : ఆ...ఆ... హుము. అట్లు జరిగెనా! లేదు లేదు.

మాధ : దాదాజీ! మీరు కొంచము తాళుడు, అమ్మాయి జెప్పుము!

మాల : కేశవుడామెను కౌగలింపబోవ నామె కెవ్వున కేక వేయగా నేను పరుగిడితిని. అపుడే యాతడు గోడదాటి పరుగెత్తెను.

మాధ : నీవిక వెళ్లవచ్చును. కాని యీ విషయము రహస్యముగామాత్ర ముంచుము. దాదాజీ! నేనిక పోయి వత్తును. మీ పిల్ల మీకు క్షేమముగా మీకు చేరగలదని నాకు తోచుచున్నది. ధైర్యముగా నుండుడు. నేవచ్చిన సంగతి సందర్భములు రహస్యముగా నుంచుడు. అని శీఘ్రముగా మాధవరావు తన స్వగృహమున కేగెను.

సాయంకాలమగుడు, మాధవుడేదియో నాలోచించుచు పరుండెను.

## 14

కృపాసింధూ, దీనరక్షకా!
నా కెట్టి యిడుములు తెచ్చితివి.

'భార్యా రూపవతీ శత్రుః' అందము కష్టపరంపరల దెచ్చుననుట నేడు నిక్కంబయ్యె. నేనీ విపత్తునుండి దరిజేరుదు ననుమాట కల్ల. తల్లిదండ్రులారా! మీరిక నాపై యాశ వదలుకొనుడని యిందిరాదేవి లోలోన గుందుచుండెను. ఆమె ముఖపద్మము సూర్యుడులేని కమలము వోలె వాడియుండెను. శిరోజములు ముడివడి యిట్టటు చింకిరి చింకిరిగా నుండెను.

ఆమె యేడ్చుటచేగాబోలు కోకిలా నినదంబుల హసించు మృదుమధుర గానము బొంగురుపోయెను. హంసతూలికా తల్పమున బరుండు చిగురుబోడి కటికిరా నేలపై బరుండుటచే శరీరము కంది మెరబారి ప్రక్కలను కదలలేక పడియుండెను.

అట్టి స్థితిలో యుండగా సుమారిరువదియైదు వత్సరముల దీర్ఘకాయుడొక్కడా గదియందు ప్రవేశించి లతాంగీ! యని ప్రశ్నించెను. ఇందిర ఆతురమున నలిగిపడి లేని యోపిక తెచ్చుకొని వెనుదిరిగి జూచి "ఎవ్వడవు నీ"వని ప్రశ్నించెను.

కేశ : అబలా ! నేను కేశవరావును.

ఇంది : హా మనోహరా! నన్ను రక్షించుకొనలేవా? నీకు నాపై యింత కినుకయేల!

కేశ : బాలా! నీవీలీల బేలవగుట వగచిన నేమి ప్రయోజనము. నాచేజిక్కినవారిని విడిపింప హరి బ్రహ్మదులకైనను శక్యము గాదని యెరుంగుము.

ఇంది : నారాయణా మనోహరా! నిన్నే దైవముగ నమ్మి సతతము నీ ధ్యానమే జేయుచుంటినే అట్టి......

కేశ : ఆ......నారాయణుడు వచ్చుట......నిన్ను రక్షించుటయా? కలలోని వార్త. నారాయణ నామస్మరణకు పరమ భాగవతోత్తములకైన విరామముండును. నీకు లేకున్న దేమి? చాలు చాలు. నీ వాక్చాతురి నింక గట్టిపెట్టుము. నన్నన్యునిగా భావింపకుము. వీడు నీ చిన్ననాటినుండియు నీ ప్రేమ కాశించియున్న కేశవుడు.

ఇం : హా దైవమా! నీవుదక్క నన్యులు కాపాడువారు లేరు ఈక్రూరునిచే నింకెట్టియిడుములు బడవలయునోగదా!

కేశ : చంద్రవదనా! భయ ముడుగుము. నీవు పరస్థలమున లేవు. నాచెంత నీకింక భయమేల! యాసిగ్గేల. మాటాడవేల. హంసగమనా! నీ దర్శనభాగ్య మెప్పుడాయని కన్నులు గాయలుకాయ నిరీక్షించుకొని యున్నాడనే. నిను గాంచినప్పటినుండి మదనుడు తన పుష్పబాణముల గాఢముగ నా హృదయమున నాటుచున్నాడు. నీ పొందు నాకీబాధ లేకుండ జేయునే.

ఇం : ఇదేటి యుపన్యాసము. మానధనాపహరణ ప్రవీణులగు నీవంటి విటులెల్లకీవిద్య నేర్చినదిగాదె. మాననీ మణుల బలాత్కరించుట, మానభంగ మొనర్చుటలు నీవెచ్చట నేర్చితివి.

కేశ : ఓ కాంచనాంగీ! పంచశరు మన్మథునికడ నేర్చితిని.

ఇం : అచ్చపు బ్రాహ్మణకులమున జన్మించి నీకిట్టి యధర్మముల కొడిగట్టుదువే? పరస్త్రీనగు నన్ను నీవిట్లుజేయు పాడియా!

కే : నీవు పరస్త్రీ వెట్లగుదువు. నను వలచి తెచ్చుటచే నా భార్యవగుదువు.

ఇం : కేశవా! పరస్త్రీలు తల్లులు, సోదరీమణులనిగదా శాస్త్రము జెప్పుచుండు. పరస్త్రీ ధనాపహరణము పాపప్రదము సుమా! పరమ పతివ్రతలగు సీత, ద్రౌపది, దమయంతి, అహల్య మొదలుగాగల సాధ్వీలలామల, మానభంగ మొనర్ప దలచినవా రేమైరో కొంచము జ్ఞప్తికి దెచ్చుకొని నన్ను వదలి పెట్టుము. నేను నా మనోవాక్కాయంబుల మరొకని వరించితిని. మమ్మాటికి నతని విడచి యన్యుని వరింప నొల్లను. ఇది నా మనోనిశ్చయము.

కే: ఇందిరా! ఏల యిన్నిలీల పలుబాముల బెట్టెదవు. పురాణ గ్రంథములలోని కథలు జరిగినవని నమ్మవచ్చునా? నవ్వు వచ్చుచున్నది. ఏమి నారాయణరావు నాకంటె మిక్కిలి రూపధన సంపన్నుడా? యేల వానిని వరింపవలెను?

ఇం: సద్గుణ సంపన్నుడని.

కే: ఆతని గుణానుగుణంబు లేనెరుగుదు. దానికేమి. నన్ను వరించి సుఖింపుము. నీవు నన్ను పరిణయమాడితివా, సాటిలేని వైభవంబు లనుభవించెదవు. జాగు చేసిన ప్రాణములు నిలువవు. పాము ఛీదినను నీటముంచినను నీదే భారమని కౌగలింపబోయెను.

ఇం: (తప్పించుకొని భీతహరిణభంగి కొంత దవ్వేగి భయవిహ్వలచిత్తయై) మూర్ఖా! ఉచితానుచితజ్ఞానశూన్యా! కామాంధా! నిన్ను ముట్టకుము. హా దైవమా! రక్షింపవా!

కే: బాలా! దైవము నను శిక్షించునా? ఏ దైవము వచ్చి నిన్ను రక్షించునో చూచెదను. నీకొక పక్షము దినములు గడువొసంగితిని. ఈలోపున జాగరూకతతో నాలోచించు కొనుమని జెప్పి వెడలిపోయెను.

కేశవుడు పరిచారికయగు కేశినితో ఇందిరను జాగరతగ జూచుచు, యామెకు వలయు సర్వసౌకర్యముల జేయ నాజ్ఞా పించెను.

47

## 15

ఒకనాటి సాయంకాలమున కల్యాణ కటకమను పల్లెయందు సుమారు నలుబది సంవత్సరముల వృద్ధుడొకడు వీధియందు దిరుగాడుచుండెను. అతడొక నీరుకావి రంగుపంచె గట్టి మొలకొక యంగవస్త్రమును పైనొక వంగపండుచాయ శాలువయును వేసికొనియుండెను. తలకొక తెల్లని మామిడంచుల కండువా తలపాగ జుట్టుకొనెను. అతని భుజముపైనుండి యొక లేడిచర్మపు చుట్ట వీపుపై వ్రేలాడుచుండెను. చేతియందొక పంచాంగమును, చెంబును తప్ప మరేమియు లేదు. నుదుట చక్కగా దీర్చిన కుంకుమబొట్టు పెద్దకాసంత గలదు.

యాతని జూచినంతనే యొక భూత వైద్యుడని యనుకొనకపోరు. ఒక తాటియాకు గొడుగు నెకము చేతిలో బట్టుకొని నడువనేక నడవలేక నడచుచుండెను. అంత నొక యువకుడు "ఏమయ్యా! నీ దేయూ"రని యడిగెను.

బాటసారి: నాయనా! నాది చాలదూరము. నేను పూనహా పట్టణమునుండి వచ్చుచున్నాను. నన్ను దారిలో దొంగలు కొట్టి నా సర్వస్వము లాగుకొనిరి. వారిని బ్రతిమాలాడి యెట్టకేలకు నా వస్తువులు తీసుకొని యిటు వచ్చినాను. ఈపూట కిచ్చట...

యువకుడు: ఏమి కావలయు. మీ పేరు?

బాట: నాయనా! యీపూట మీయింట కొంచెము ప్రసాద మిడిన తెల్లవారుజామున లేచి పోయెదను. నన్ననుగ్రహించుము.

యువ: మీ పేరెవ్వరండి? పేరు చెప్పరేం?

బాట: తండ్రీ! నన్ను రామదాసుడుర. మాతండ్రీ! ఏదో మీవంటి కరుణార్ద్ర హృదయులు కరుణించవలెగాని... మాబోంట్ల జూచు వారెవరు?

యువ: తాతగారూ! మీకేలోటును లేదు. సుఖముగా నుండవచ్చును. అమ్మా! ఈ తాతగారికి యీ రాత్రి భోజనము బెట్టి వారికి పరుండుటకు సావడిలో బల్లపై పరుపువేయించి యచ్చట పరుండ జేయుము. తాతగారూ! నేను కొంచము పనిమీద వెళ్లవలసియున్నది. మీ విషయము మా తల్లిగారితో జెప్పినాను. సుఖముగా భుజించి సావడిలో నిదురించుము.

బాట: నాయనా! నీవీరాత్రికి యుండకూడదా?

యువ: తాతగారూ! నాకు కొంచము జరూరు పని యున్నది. మీకేలోటును లేదు. యిద్యది మీ స్వగృహముగా నెంచి సుఖముగ పరుండుము. తెల్లవారుసరికి నే వత్తునని జెప్పి యువకుడు వెడలిపోయెను.

అదేమో! యువకుడు పోయినది మొదలుగా మన బ్రాహ్మణున కుల్లాస మెక్కుడాయెను. చీకటిపడు కొలది యాత్రుత మెండయ్యె.

రాత్రి యెనిమిది గంటలైనది. భోజనమునకు లేవండి యని కాళ్లు చేతులు కడుగుకొనుటకు నీళ్లు గుమ్మములోనుంచి యొక వితంతువు లోనికి పోయెను. కాళ్లుచేతులు కడిగికొని బ్రాహ్మణుడు వారిచ్చిన యారవేసిన బట్ట ధరించి, వంటశాల యందొక పీటపై సుఖాసీనుడయ్యెను. ఆ యింటి యజమాను రాలు కాబోలు నొక వితంతువు యాతనికి వడ్డించుచు,

దేశాచారప్రకారము మీకు పిల్లలెందరు? వారికి పెండ్లిండ్లు యయినవా? మీ రెచ్చటినుండి వచ్చుచున్నారు? మొదలగు ప్రశ్నలడిగెను. దానికి మన శాస్త్రులుగారు సమాధానము జెప్పి యీ క్రింది విధముగ సంభాషించెను.

బ్రాహ్మ: అమ్మా! ఆ కుర్రవాడు మీకు కుమారు డగునా? అతని పేరేమి?

వితం: అయ్యా! అగును. అతనిపేరు కేశవరావు. తండ్రి చిన్నతనముననే పోయిరి. అప్పటినుండియు కష్టములను పడిపడియున్నాము.

బ్రా: కేశవరావునకు వివాహమైనదా?

వితం: లేదు. మేనరికము చేయుదమనుకొనుచుండ యెవరో దొంగ లెత్తుకబోయిరట.

బ్రా: అయ్యో! ముందొచ్చిన చెవులకన్న వెనుక వచ్చిన కొమ్ములు వాడి యన్నట్లు మేనరికముండగా పరులు పెండ్లాడుటా! ఇంతకు దురదృష్టవంతుడు......... అమ్మా! మీకుర్రవాడేమైన నుద్యోగములో నున్నాడా?

వితం: ఉద్యోగము లేదు, చదువూ లేదు. ఏదో స్నేహితులతో గలసి కాలక్షేపము జేయుచుండును. కలదు గదా! తాత ముత్తాతలు గడించిన యాస్తి కొంచెము.

బ్రా: అవునుతల్లీ! ఉద్యోగము లెచ్చటనున్నవి? అందునను బ్రాహ్మణులకు.........బ్రహ్మద్వేష మెక్కువ ప్రబలుచున్న"దని లోక సందర్భముల కాలక్షేపము జేయుచు భోజనము జేసి జేయి కడుగుకొని తనకై వేయబడిన ప్రక్కపై గూర్చుండి యేదియో యాలోచించుచుండెను.

రాత్రి సుమారు తొమ్మిది గంటలు కావచ్చినది. ఆ గృహిణి యిల్లంతయు చక్కబెట్టుకొని చావడిలోనికి వచ్చి "అయ్యా! ప్రొద్దుబోయినది. పరుండుడు. చాలదూరమునుండి శ్రమపడి వచ్చినారు. తెల్లవారినతర్వాత వెళ్లవచ్చునులెండి. ఈ తెల్లవారుజామున వెళ్ళవలసియున్నచో నన్ను లేపు"డని జెప్పి యామె తాను పరుండు గదిలోనికి పోయి నిదించెను. కేశవరావుగది తల్లి పరుండు గదిచావడికి దక్షిణమువైపు నున్నది. అందామె తనకు సహాయార్థ మొక స్త్రీని పరుండబెట్టుకొనుట వాడుక.

ఆనాడా స్త్రీ యూరలేనందున రాత్రిగు ... ను నే నామెకు నొంటరిగా పరుండుటకు కొంచము భయముగా నుండెను. కాని లేనిధైర్యము దెచ్చుకొని చావడిలో బ్రాహ్మణుడు సాయము కలడుగదాయని నిర్భయురాలై పరుండెను.

అంతయు నిశ్శబ్దము. చీమ చిటుక్కుమనిన చప్పుడగు చుండెను. మన కపట బ్రాహ్మణుడు ప్రక్కపైనుండి మెల్లగ లేచి యామె పరుండుగది కీవల గొళ్లెము వైచి నిర్భయముగా నిశ్చలమగు మనస్సుతో 'యిది మీ స్వగృహముగా నెంచు' డనుమాట జ్ఞప్తికి తెచ్చుకొని మనసులో సంతసించుచు మెల్లగా నుత్తరపువైపున నున్న గది తలుపు తెరచి లోన ప్రవేశించెను.

అందతనికి కావలసిన వేవియును పొడకట్టలేదు. అచ్చటి నుండి పడమటివైపుననున్న గదియు, నసారాయును గాలించగా నందేమియు దొరుకలేదు. మరల చావడిలోనికి వచ్చి తూర్పు

వైపు వీధిలోనిగది తెరచి యందు వెదకెను. అందు కేశవుడు తన మిత్రులు వచ్చినపుడు కాలక్షేపము చేయును. అందొక డ్రాయరును, నాలుగు కుర్చీలును గలవు. మన బ్రాహ్మణుడా డ్రాయరును తెరచిచూడగా నందునగూడ యేమియు కాన్పించ వాయెను.

పిసిగి నేసారి దక్షిణావైపుననున్న గదిలోనికి పోవుటకు మరొకదారి లేక చావడిలోనికి వచ్చి కొంతతడవు విశ్రమించి మరల లేచెను. తాను యిప్పుడు కేశవరావు తల్లి పరుండిన గదిలోనుండి పోవలయును. గొళ్లెము తీసెను. తలుపు మెల్లగా త్రోయునపుడు కిర్రుమని చప్పుడాయెను. తోడనే యామె లేచి "యెవరువా"రని ప్రశ్నించెను. "అమ్మా! నేను. కొంచము మంచినీరు గావలయును. దాహమగుచున్నది.

వితంతువు "అటులనా... తెచ్చి యిచ్చెద నంటు" డని లోనికిపోయి మంచినీటిని దెచ్చి యిచ్చి తన గదిలో తాను పరుండెను.

బ్రాహ్మణుడు మంచినీరు త్రాగినటుల నటించి తన శయ్యపై నిదురవోవుచోనిభంగి కన్నులు బిగబట్టి నిదురించెను. గడియారము రెండు 'ఠంగు ఠంగు' మని కొట్టెను. ఆలసించిన ఆశాభంగ మగునని తలచి వెంటనే లేచి తలుపు మోరువాకిలిగ నుంచుటచే చప్పుడు చేయకుండగ మెల్లగ గదియందు ప్రవేశించెను.

ఆ గదియందతి ఛాందసముగ వ్రాయబడిన బొమ్మలు గలవు. ఆ గదిలోనుండి పడమటివైపున నొకగది గలదు ఆ గది

సుమారు పది యడుగుల పొడుగును, యెనిమి దడుగుల వెడల్పును గలదై యుండెను. దానిలో నొక పందిరి పట్టెమంచమును దానిపై నొత్తుగా నుండుటకుగాను రెండు పరుపులు వేయబడియుండెను. మంచమునకు తలంపు దిక్కున కర్రపెట్టె యొక్కటమర్పబడియున్నది. దానికి తాళము వేయబడియుండ లేదు.

దానిని మన పరిశోధకుడు పరిశోధించగా నందు కొన్ని కాగితములు దొరకెను. వానిలో తనకు గావలసిన కాగిత మొకటి తీసికొని మిగతవానిని దానియందే పారవైచి యెప్పటి యట్లు వేసెను. తదుపరి బ్రాహ్మణుడు నిశ్శబ్దముగ చావడిలో ప్రవేశించి నటనుండి గాఢనిద్రనుండి లేచినవానివలె కన్నుల నులుముకొనుచు "అమ్మా! తెల్లవారు జాము కావచ్చినది. నే పోయెద" ననెను. నిజముకాబోలునని యా గృహిణి తలుపు తెరచి వానిని పోనిచ్చి తలుపు గడియవేసెను.

చదువరులారా! ఈ కపట బ్రాహ్మణు డెవరని యూహించితిరి? ఈతడే యనేక చోరశిఖామణులకు కృష్ణ జన్మస్థానంబుల జూపించిన పరిశోధక చక్రవర్తి మన మాధవ రావు, మాధవరావు యూరుబయటనున్న తన యశ్వము నధిరోహించి తన కార్యాలయమునకు బోయెను.

కార్యాలయమున తాను పోయినచోట జరిగిన యావ ద్వృత్తాంతమును వారికి విశదపరచి, తాను తీసుకువచ్చిన కాగితము నీ క్రిందివిధముగా చదివెను:

" ప్రియమిత్రమా, దుష్టబుద్ధీ!

నీవు నేడు మనకార్యాలయమున నన్ను గలసికొనుము. బొంబాయి నగరమున నైట్ లేన్ నం౩ మధుసూధన్ గారి యిల్లు దోపిడీచేయ నిశ్చయించితిమి. నీవు జాగుచేయక త్వరితముగ రావలయును.

ఇట్లు,

అపరాధ పరిశోధక హంతకచక్రవర్తి "

అది వినినతోడనే కార్యాలయములోనివారు నివ్వెర పడిరి. యెట్లైనను మధుసూదన్ గారిని రక్షింప సమకట్టి వేత్ర పాణుల కొందరి నానాటిరేయి కాపుంచ సమకట్టిరి.

## 16

నారాయణరావునకు సబిన్స్పెక్టరు ట్రయినింగు పూర్తి యయినది. తోడనే యాతనిని బొంబాయి పట్టణమున సబుయినస్పెక్టరుగా నియమించిరి. నారాయణరావు బొంబాయి వచ్చినతోడనే తన స్వగ్రామమగు మందారవతి తల్లిదండ్రులకడకు బోయెను. వారపరిమితానందమున మునిగి తేలుచుండిరి.

బొంబాయి నగరమున మన నారాయణరావు సబుయినస్పెక్టరుగా వచ్చెననువార్త యాతని స్నేహకోటిలో యందరకు తెలిసెను. రామనాధ్ తన ద్విచక్ర శకటముపై త్వరితముగ నేగి మందారవతియందు నారాయణుని కలుసుకొనెను. అంత రామనాధ్ నారాయణులు కుశలప్రశ్నలైన కొంతవడికి రామనాధ్ మొగమేకారణముచేతనో చిన్నవోయి నట్లుండెను.

నారాయణుడది గ్రహించి "రామ్! నీ ముఖము వాడి యుండుటకు కారణము జెప్పుము. నాకడ నీ వేదియు దాచ జాలవుకదా? నేడు యేదియో రహస్యము చెప్పజాలక యాందోళన పడుచున్నావు. మిత్రమా! నాచేనైన యుప కారము నేను జేసెదను చెప్పుము" అని నారాయణుడడిగెను.

రామనా: నెచ్చెలీ! ఏమని చెప్పుదును? కర్ణకఠోరము. నాకంటెను ప్రియతమంబగు వస్తువును, నీ ప్రాణతుల్యమును పోగొట్టుకొంటివి.

నారా: మిత్రమా! అదేదియో సత్వరము జెప్పుము. మనమాందోళనపడుచున్నది. అదెట్టిది!

రామ: నారాయణ్! సుమారు పదిరోజుల క్రిందట నీ యిందిరను యెవరో దొంగ లెత్తుకపోయిరట. ఆమె నిన్ను దక్క యన్యుని వరింపనని ప్రతినబూని, మేనరికము నొల్ల కుండుటచే తుదకు చోరుల జేతులలో బడె"నని జెప్పి కంట తడిపెట్టసాగెను.

నారాయణరావు చిత్తము తత్తరమందగా కుదురు జేసుకొని మెల్లగా "మిత్రమా! విచారించిన నేమి ప్రయోజ నము. దైవానుకూల్యత లేకుండిన 'ఓడలు బండ్లును, బండ్లోడలు నగుగాదె' ఇందిరా నాకును నీకును వివాహము పొసగు టతికష్టమని జెప్పలేదా! నా నుడులు లెక్కగొనక నామీద మక్కువచే నీవటుల బలు యిక్కటుల బడుచుంటివా!

దైవమా! నీ లీల లవాఙ్మానసగోచరములు. నీవు తలచిన సాగనిదెద్ది? భిక్షాధికారి నొక ఘడియలో లక్షాధికారిగ నొనర్తువు. లక్షాధికారిని మరుక్షణమున బిచ్చమెత్తింతువు"

యని చెల్లాచెదరైన యాశాలతను కుదురుజేసి, "రామనాథ్ ! 'గతజల సేతుబంధనమేల' మనము కడు ప్రమత్తులమై యామె నన్వేషించు ప్రయత్నమున నపరాధపరిశోధకునకు సహాయ మొసర్తు మని యాపూట కచ్చట భుజించి యిరువురును బొంబాయి పట్టణము జేరిరి.

మరునాటి యుదయమున కార్యాలయమున మాధవ రావుగారిని సబుయినస్పెక్టరు, రామ్‌నాథ్‌లు కలుసుకొనెను. నారాయణరావు రామ్‌నాథ్‌లు సవినయముగా హిందూదేశ కులాచార ప్రకారము నమస్కరించి సుఖాసీనులైరి. తరువాత మాధవరావుగారు వారిని కుశలప్రశ్న లడిగి "నారాయణ రావుజీ ! నీవు యువకుడవు. నీవలన నాకు మిక్కిలి సహాయము గావలసియున్నది. ఈ మధ్యను కల్యాణకటకమందు దాదాజీ గారను ధనికుని దోచి యాతని యనుంగు కూతును చోరు లెత్తుకపోయినారు. ఆమెను రక్షింపవలయు. నీవు నాకు సాయము జేసినచో కడు సులభముగ లభించగలదు"

నారా: "అయ్యా ! నేను మీకు యా విషయమున నా యావచ్ఛక్తిని ధారపోతును. నాతోగూడ నా ప్రియ స్నేహితుడుగూడ ప్రయత్నించు"నని జెప్పి మాధవునికడ శలవు గైకొని రామనాథ్‌తో తన బసకుపోయెను.

## 17

ఈనాటిరేయియందు బొంబాయి పట్టణమున మధుసూదనుని సౌధము దోపిడి గానున్నది. మధుసూదనుని రక్షించుటకు మన పత్తేదారుడు తగు సన్నాహములు జేసెను. సుమారిరువది

మంది పోలీసు జవానుల యింటిచుట్టును పారాయిచ్చెను. లోన మధుసూదనునకు మరిద్దరుపోలీసులు సహాయముగా పరుండుటకు కావలియిచ్చెను. సాయంసమయ మగుసరికి పోలీసులు సిద్ధముగా తుపాకులతో, కరవాలములతో సిద్ధమై మధుసూదనుని యింటి కడ హాజరై తమ విధిని వారు నిష్కపటముగా జేయుచుండిరి.

కనుచీకటి పడెను. శరవేగమున వచ్చుచున్న గుఱ్ఱముల డెక్కలచప్పుడు వినినతోడనే పారాజవాను లొకరితోనొకరు కూడబలుకుకొని "జాగ్రత! వారే దొంగలు కావచ్చును. వచ్చినతోడనే వారి మదమడగించితిమా మనము దొరతనము వారిచే హెచ్చు వేతనము పొందవచ్చును. ఔరా! దొంగలు నిర్భయముగా నడివీధిలోనుండి వచ్చుచుండిరే" యని వా రాశ్చర్యపడజొచ్చిరి. మధుసూదనుని గుమ్మముకడ గుఱ్ఱము లాగెను. తోడనే పోలీసులు వారిని ముట్టడించి తుపాకుల జారుజేసిరి.

చోరులందరును కాకిదుస్తులతో నుండిరి. నెత్తిపై ప్రతివానికిను యెఱ్ఱని టోపీ నొకదానిని ధరించియుండెను. పోలీసు జవానుల మోసము చేయుటకై వీరును పోలీసు దుస్తులను ధరించియుండనోపు.

వెంటనే చోరనాయకుడు "అరే! నే నెవడనో మీకు తెలియునా? తెలిసికొనకుండగా చంప జూచుచున్నారే! నేను మాధవరావును. గ్రీన్ షేక్స్వార్ పార్కులో నెం 348 యింటియందు దొంగలుపడి దోచుచున్నారు. సత్వరమచ్చటకు బోవలయు"నని యనినతోడనే చుట్టు పారాగాయుచున్న పోలీసులది నిజమని తలచి యచ్చోటకు పర్వెడిరి. ఇంతవరకు

చోరనాయకుని పన్నుగడ ఫలించినది. వెంటనే నిర్భయముగా లోనికేగి మధుసూదనుని తలుపు 'తలుపు' యని కేకవేసెను

మధుసూదనునకు కావలి గాయుచున్న పోలీసులలో నొకడు వచ్చి తలుపావల నిలువబడి "యెవరు వా" రని ప్రశ్నించెను. "నేను మాధవరావును. తలుపు నతి త్వరితముగ తీయు" మనెను. జవాను కంగారుపడి తటాలున తలుపుతీసెను. ఏమున్నది? అతి భయంకరము. చోరనాయకుడు పోలీసు నోటి యందు గుడ్డనుకుక్కి మొలలోని సురియను వెలికితీసి తటాలున వాని గుండెలలో పొడిచెను. ఆ రక్తసిక్తమగు కత్తితో చోర నాయకు డేదియో గోడపై పెద్ద యక్షరములతో వ్రాసెను.

తోడనే పోలీసు కేకవేయుటకైనను నోరు లేక చేయునది లేక క్రిందపడి విలవిల గొట్టుకొనుచుండెను. చోరులు నిర్భీతిగా లోన ప్రవేశించిరి. మధుసూదను డొంటిగ నుండెను. చోర నాయకుడు మధుసూదనునితో నిట్లనియె, "ప్రాణములపై నీ కాసగలదేని నీ చేతులతో నీ సర్వస్వము తెచ్చియిమ్ము. అటు గాకపోయిన నా ఖడ్గము నీ రక్తము చవిజూడనైయున్నది"

మధుసూదనుడు చేయునది లేక తనవద్దనున్న అయిదు వేల రూప్యములను వారికివ్వ వారు వాటిని దీసుకొని చోర నాయకుడు తనవద్దనున్న రివాల్వరుతో గాలిలో రెండుసార్లు 'ఢాం ఢాం' మని ప్రేల్చి తమ వాహనముల నెక్కి నిరాటంక ముగా బోయిరి.

'ఢాం ఢాం' మని చప్పుడగుటతోడనే యిరుగుపొరుగు వారందరును లేచిరి. ప్రక్కవీధికై పరుగిడిన పోలీసులు మోసము

జరిగినదని మిక్కిలి విచారించుచు పరుగున వచ్చిరి. వచ్చి చూచుసరికి అంతయు కడు భీభత్సముగా నుండెను. గుమ్మము వద్ద నొక శవము పడియుండెను. ఒక శయ్యపై మధుసూదనుడు వెక్కి వెక్కి యేడ్చుచుండెను. పోలీసు వారు జరిగిన మోసమునకు విచారించుచు మధుసూదనుని యూరడించి వెంటనే మాధవ రావు, నారాయణరావులకు కబురుజేసిరి. జరిగిన మోసమునకు చాల వగచుచు మాధవుడు మాధుసూదనుని గృహమునకు నారాయణరావుతో వచ్చెను.

నారాయణరావునకదియే ఖూని కేసులుజూచుట ప్రథమ మగుటచే నివ్వెరపడిపోయెను. మాధవరావు యింటినంతను సోదా చేయగా నేమియు దొరకలేదు. తిరిగి వెడలునపుడు గోడపై గుమ్మమువద్ద నేదియో వ్రాయబడియుండుట జూచెను.

"మాధవరావూ!

నీ వెంతియో యేర్పాటము నీ జమానుల కాపుంచితివి. వారి తెల్వి కాలం! వారి తెల్వి నేటలకు నన్ను బట్టగలరా? నేను నీ శ్రేయస్సుకోరి జెప్పుచున్నాను; నన్ను పట్టు ప్రయత్నమును మానుము. నాతోడి విరోధము 'యనిద్రాన్యానిచర్య వంటిది'

ఇట్లు భవచ్ఛ్రేయోభిలాషి,

అపరాధ పరిశోధక హంతకచక్రవర్తి"

అది జూచుసరికి మాధవుని కాశ్చర్యమొదవెను. నారా యణున కొడలు జల్లుమనెను. చూడవచ్చినవారికి 'యీ హంతకునిబట్ట సాధ్యముగాదు వీడెవడో ఛండశాసనునివలె నున్నా'డని యనిపించెను. మాధవరావు ఈ ఖూనీల విషయమై దొంగలను బట్ట దర్యాప్తు చేయుచుండెను.

18

ఇరువురు బాటసారులు ఒకనాటి మధ్యాహ్నమున తమ యశ్వముల నధిరోహించి వడిగ తోలుచుండిరి. ఆ గుఱ్ఱముల వేగమునకు బాటయంతయు డెక్కల చప్పుడులచేతను, ధూళిచేతను నిండించెను. ఈ యారోహకులయం దొకనికి సుమారిరువది వత్సరములును, మరొకనికి యిరువది రెండు వత్సరములు నుండెను.

ఒక గంట యగుసరికి వారు దుర్గమమగు కారడవి జొచ్చి తమ గుఱ్ఱంబులు నడువమి వాహనముల డిగ్గి మెల్లగా నడిపించుకొనిపోవుచుండిరి. అట్లు కొంతదూరము పిదప వెనుక నుండి యెవరో తమ్ము వెంటాడుచున్నట్లు సంభాషణ వినవచ్చెను. వెనుదిరిగి చూచుసరికి యేమియు గన్పించుట లేదు. బాటసారులిర్వురును నివ్వెరపడి ఒకరితో నొకరిట్లు సంభాషించిరి:

మొదటి: మిత్రమా! నీవు మిక్కిలి జాగరూకుడవై మెలంగుము. మనము దొంగల కాపురమగు ప్రదేశమును ప్రవేశించితిమి.

అనుచు వారు కొంతదూరము పోవుసరికి వెంటాడుచున్న చోరులు ముందున కెదురేగి "యెవరు మీరు? ఎచ్చట నుండి వచ్చుచున్నారు?" అనిరి.

"మేము బొంబాయి పట్టణమునుండి వచ్చుచున్నాము. దారి తెలియక యీ ఘోరాటవియందు జిక్కితిమి. దయయుంచి పూనాపట్టణముపోవు దారి జూపి పుణ్యము గట్టుకొను" డని జవాబిచ్చెను.

చోరులు: మీవద్దనున్న సర్వము నొలిచి యిట పెట్టుము. తరువాత మీ దారి నే చూపింతుము

బాట: అయ్యా! మావద్ద నేమియు లేదు. మమ్ము నిర్బంధించకుడు.

చోరులు పైబడి దోచుకొనబోగా బాటసారు లిరువురు తిరుగబడి వారిని వోడింప చోరులు వెంటనే యీలనూద నేలయీనినట్లు చోరులు కాలకింకరులవలె యచటకు వచ్చిరి. పాపము బాటసారు లేమిచేయగలరు. ఆ హంతకుల చేతులలో బడవలసివచ్చెను.

అంతట వారిని బంధించి తమ నాయకునికడకు దీసుకుపోయి నాయకుని యాజ్ఞానుసారముగ దొంగలు బాటసారులను పాతాళగృహ ప్రవేశము గావించిరి.

దైవయోగ మెవ్వరికిని దాట నశక్యంబు. 'తానొకటి తలచిన దైవమొకటి తలచె" నన్నట్లు పరోపకారార్థమై యేతెంచిన బాటసారు లిర్వురకు పాతాళగృహప్రాప్తి గలిగెను.

## 19

మాధవరావు తన కార్యాలయమునకు ప్రాతఃకాలముననే తెంచెను. ఇందిర జాడలు కనుగొని వత్తుమని బోయిన నారాయణరావు, రామనాథ్‌లు తిరిగి రాలేదు. మన మాధవుడు దోళనపడజొచ్చెను. సుమారు తొమ్మిదిగంటలు కావచ్చినది. టపాలు బంట్రోతు ఒక కవరును తీసుకువచ్చి మాధవరావుగారి బల్లపై నుంచి వెడలిపోయెను. మాధవరావది యందుకొని దాని నామూలాగ్రముగ చదివెను. ఒడలు కంపించెను. దానియందిట్లు వ్రాయబడి యున్నది:

"అపరాధపరిశోధక బిరుదాంకితులగు మాధవరావునకు,

నీవీమధ్య నా గుట్టు తెలిసికొనుటకై పంపిన రక్షకభటులేమైరో తెలిసినదా? వారు నా కారాగారమును కాపుగాయుచున్నారని తెలియవలెను. నీవు నిన్న పంపిన సైనికులకు సైతము నదియే పాటు సంభవించినది. కావున నన్ను బట్టు ప్రయత్నమును మానుమని నీహితముగోరి జెప్పుచున్నాను. అనేక చోరశిఖామణుల ద్రుళ్లడగించి బంధీల జేసితినని నీవు మిక్కుటముగ గర్వించుచున్నావు. నన్ను బట్ట హరిబ్రహ్మాదులకైనను శక్యముగాదు. అట్టిచో త్రికాలముల సంధ్యావందనము జేసికొను బ్రాహ్మణుడవు......నీవు నన్నుబట్ట నిక బ్రయత్నించకుము. నాతోడి విరోధము 'కాలసర్పమును ముద్దిడుటవంటిది'

ఇట్లు భవత్ శ్రేయోభిలాషి,
అపరాధ పరిశోధక హంతకచక్రవర్తి"

ఈ జాబు చదివినతోడనే పులకాంకిత గాత్రుడై ప్రతి రోమకూపమునుండియు యగ్నిజ్వాలలు వెడలుచున్నవా యనునట్లు ప్రళయకాల మార్తాండునివోలె గంభీరమగు స్వరముతో "ఔరా! అనన్యసామాన్య విక్రముండనై, దిగంతముల కీర్తి విస్తమింపచేసి నేడొక తులువచే పరాభవింప బడుటా! భయంకర మానవపిశాచములగు చోరు లెందరు నాచే మడిసిరి? నా కరవాలమున కెందరు బలియైరి. అయ్యది యించుకయు లెక్కగొనక నన్ను బ్రాహ్మణుడని పరిహసించుచుంటివిగా! ఈ బ్రాహ్మణుని సత్తువ నీకేమి తెలియును?

ఓరీ మూర్ఖా! 'వినాశకాలే విపరీతబుద్ధిః' యనునట్లు నీకు కాలము దాపురించినది. ఓ కరవాలమా! నీ రాజభక్తిని, నీ మతాభిమానమును వెల్లడించు సమయము వచ్చినది. నీవు విచ్చలవిడిగ సంచరించి, నిను పీడించు నాకలిదప్పులను వైరి శిరచ్ఛేదనానంతరము వారి రుధిరధారల గ్రోలి, తత్ఫలంబు భుజించి, నీ క్షుత్పిపాసలను తీర్చికొను"మని హెచ్చరిక జేసెను.

## 20

హా ఆర్తశరణ్యా! దీనరక్షకా!
నన్నీ విపత్సముద్రమునుండి
రక్షింపలేవా! యని యిందిరాదేవి దైవమును ప్రార్థించుచుండెను. శరీరము శుష్కించి బెంగచే సగమాయెను. ప్రాణములు నిల్చుటకుమాత్రము కొంచమాహారము తీసుకొనుచున్నది. హాయిగ, నిశ్చింతగ తన స్వగృహమున గదియందు బరుండు సుకుమారి నేడు శారడవిమధ్య యనేక చోరశిఖామణుల మధ్య బరుండవలసివచ్చెను.

తలుపు కొంచము ముందుకు త్రోయగా, 'యిందిరా!' యని పిలుపు వినబడెను. తోడనే యిందిర కొంచము ప్రక్కకు తిరిగి చూడగా కేశవరావు మందహాస ముట్టిపడునట్లు చిరునవ్వు నవ్వుచు నిలువబడెను.

ఇం: అబలనగు నన్నిన్ని యిడుములు గుడిపించు చుంటి ననియా నీ సంతసము?

కేశ: బాలా! ఎందులకు నన్నింత పరిశీలించెదవు. నేను నీయందు బద్ధానురాగుడనై యున్నాను. నీకును నాయందనురాగము గలదని యెరుంగుదును.

ఇం: ఛీ మూర్ఖా! 'తల్లి కలివోసి పెట్టినను నట్టినం కే జూచె" నన్నట్లు నేను వేరొకని వరించితినని జెప్పిననూ తెలియకున్నాడవు. నా త్రికరణశుద్ధిగా నిన్ను వివాహమాడను.

కేశ: నీవెట్లు వేరొకని పరిణయమాడెదవు!

ఇం : చెరవిముక్తి గలిగినతరువాత.

కేశ : అదెట్లు సాధ్యమగును? నా చేజిక్కినవారిని తప్పింప నా ముక్కంటికైనను సాధ్యముగాదు.

ఇం : హా మనోహరా!

కేశ: "అతడేటి మనోహరుడు. నేనే నీ మనోహరుడను. రమ్ము, కౌగలి"మ్మని కౌగలింపబోగా కేశవుని మొలనున్న కైజారును యిందిర తటాలున నూడబెఱికి—

ఇం : కామాంధా! నన్ను తాకితివేని దీనికి బలి యిచ్చెదను మారుమాటాడక యావలికి బొమ్ము. తెలిసినదా!

కేశ : ఓసీ వగలమారీ! నీచేత కైజారున్నంత మాత్ర మున కే జడియుదునా? వీడు కేశవుడనితలంపుము. ఆ మదానిపై చేయిజేసికొనుట యపకీర్తిదాయకమని యాలోచించుచుంటిని. లేకున్నచో యిప్పుడే నిన్నీ ఖడ్గమునకు బలియిచ్చియుందును. నీయందలి ప్రేమచే నన్నీ ఖడ్గము బురికొల్పుటలేదు. ఉచితా నుచితములు తెలిసికొని మెలంగుము. జాగ్రతగా నాలోచించు కొనుమని జెప్పి కేశవుడు వెడలిపోయెను.

ఇం : హా మనోహరా! నీ వెప్పుడో నన్ను పరిణయ మాడుదువని గంపెడాసతో నుంటినే! అట్టిది కరవైపోయె. నన్ను నీవు రక్షించుకొనలేవా యనుచు యిందిరాదేవి హీన స్వరముతో క్రిందబడి విచారించుచు తలబోయుచుండెను.

ప్రక్కగదియందే బంధీ చేయబడిన నారాయణు డాది నుండియు జరిగిన సంభాషణ వినెను. ఆపెయే యిందిర యని మనసున నిశ్చయించెను. ఆమెను రక్షించుట యెట్లో నాతనికి తోచుటలేదు. "ఇందిరను కొలదిరోజులలో తప్పించకున్నచో

మానభంగ మగునని భయముతో యసువుల బాయును. ఆమెను రక్షించుటెట్లు? పాపము నాతోబాటు రామనాథ్ గూడ బంధీయైనాడు" అని విచారించుచుండ రాత్రి సుమారు యేడున్నర గంటలు కావచ్చినది.

ఒక సేవకుడు నారాయణరావున్న గదితలుపుతీసి లోనికి భోజనము తీసుకువచ్చి మరల మీాట నొక్కగా తలుపు వేయ బడెను. తలుపు తెరువబడునపుడు మీాట యెట్లు కదిలెనో యాతడు వేయునపుడెట్లుపడెనో నారాయణరావు సూక్ష్మముగా గ్రహించెను. నారాయణరావు చేతుల సంకెలలు తీసి భోజనము చేయుమని ముందు పెట్టుచుండెను. అంతలో నారాయణరావు తటాలున వాని మెడలపై కురికి గొంతుక గట్టిగా పట్టుకొని క్రింద బడవైచి నోట గుడ్డను కుక్కెను. నోట మాటరాక సేవకుడు క్రింద బడిపోయెను.

తన చేతుల సంకెలలను సేవకుని జేతులకు దగిల్చి యాతని దుస్తులు తాను ధరించుకొని వెంటనే నారాయణరావు బయటకువచ్చి తన ప్రక్కగదియందిందిర యుండుటచే యామె యున్న తలుపుదీసి లోన ప్రవేశించెను. ఇందిర భీతచిత్తయై "ఓరీ మూర్ఖా! నిన్నిప్పుడే యీా కైజారునకు యెరజేసెదను. చూడు" మప పోవుచుండగా నారాయణరావామె జేయి పట్టుకొని "యిందిరా! నేను నారాయణరావును" అని తన దుస్తులను తొలగించెను.

ఇందిర నయనంబు లానందబాష్పములు నిండ, "హా నా మనోహరా! నన్ను రక్షింపవచ్చితివా? నేను నిన్ను జంప సాహసించినందులకు క్షమింప వేడుచున్నాను" అన్నదామె.

"ఇందిరా! యిది క్షమాపణలకు వేళగాదు. ఆలసించిన చో పరిస్థితులు విషమించును. నేను నిన్నిప్పుడు దీసుకుపోయిన యీ దొంగలనుబట్టు టసాధ్యమగును. కావున యిందిరా! నేను పదిరోజులలో వచ్చి మరల నిన్ను కలుసుకొందును. ఆత్మహత్య మహానరకముసుమా! నేను తప్పక నిన్ను విడిపించి తీసుకుపోయెదను. మన స్నేహితుడు రామనాధ్ గూడ నాతో బాటు బంధీయయినాడు. నేను వానిని వెదకి యిప్పుడు తీసుకుపోవలయును. నే బోయివచ్చెదను. ధైర్యముగా నుండు" మని నారాయణరావు గది బీగమువైచి తాను గృహమునంతను వెదకుచుండెను.

రామనాధ్ యెచ్చటను గాన్పించుటలేదు. ఇంకొక్క గదిమాత్ర మున్నది. అది వెదకుటకు నారాయణరావు ప్రయత్నించి, తలుపువద్దనున్న బీగము లాగుసరికి దానిలో రామనాధ్ బంధింపబడియుండ వానిని బంధవిముక్తుని గావించి వారిరువురును వెంటనే పలాయనమైరి.

## 21

రామనాధ్ నారాయణరావులు మర్నాటి సాయంత్రము నాలుగు గంటలకు సురక్షితముగా బొంబాయి పట్టణము జేరి కార్యాలయమున మాధవరావుగారిని కలుసుకొనిరి. మాధవరావునకు వీరిని జూచినతోడనే నయనంబు లశ్రువులు నిండ "మీ పోయిన కార్య మేమైన" దని ప్రశ్నించెను

నారాయణుడు తాను బయలుదేరినదాది పడినకష్టముల నెరిగించి యిందిరను కనుగొంటిని. ఆమె యిప్పుడు కేశవుని యధీనములో నున్నదన్నతోడనే మాధవునకు హృదయపద్మము వికసించెను. ఆశాంకురములు మొలకలెత్తె యిక మనకు యిందిర దొరకినటె యని సగర్వముగా బలుకుచు యేదియో రహస్యమును నారాయణ, రామ్‌ల చెవులలో జెప్పె; వారు నందుల కియ్యకొనిరి చీకటి పడుచుండుటచే యెవరి గృహములకు వారు జేరిరి. రాత్రి భోజన మైనతోడనే మాధవరావు సేవకుని బిలిచి నీవుపోయి తెల్లవారుసరికి నలుగురు పోలీసులను సిద్ధముగా నా యింటికి రావలసినదని చెప్పి రమ్మని పంపించెను.

మరునాడు తెల్లవారగట్లనే లేచి మాధవరావు కాల కృత్యముల దీర్చికొనెను. రక్షకభటులు సిద్ధముగా తుపాకులతో హాజరైరి. వారిని వెంటబెట్టుకొని తానెచ్చటికో పయనమై పోయెను. ఏడుగంట లగుసరికి వారొక పల్లెను సమీపించిరి. అంత మాధవరావు తన పోలీసు దుస్తులను తీసివేసి బైరాగి వేషమును వేసెను. ఆ పల్లె రెండు ఫర్లాంగుల దూరము మాత్రము గలదు. అందుచే మన పరిశోధకుడు కాలినడకనే ముందు బోయెను. వెనుక నాతని సైనికులు వచ్చుచుండిరి. ఆతడొక పెంకుటింటిముందు నాగి "అయ్యా! కేశవరావు గారూ" యని పిలచెను. కేశవుడు బయటకు వచ్చి 'యేమని' ప్రశ్నించెను.

బైరాగి: అయ్యా! మీతో కొంచము రహస్యము మాట్లాడవలయును.

కేశ : ఏమది ? త్వరితముగా జెప్పుము !

బై : మీరు దొంగలలో నొకరై యున్నారని మాధవ రావునకు తెలియవచ్చినది. అందుచే యాతడు మిమ్ముల నరెస్టుచేయ వచ్చుచున్నాడు.

కేశ: దొంగలలో నొకడనని మాధవున కెట్లు తెలియును?

బై : చారులవలన విని ...అనుమానముపై నిన్ను... మాధవ...రావు...

కేశ : మాధవుడా నను బట్టునది. నా ముష్టిఘాత మిదివర కెన్నడు రుచిచూచి యెరుంగడు. రానిమ్ము.

అని కేశవరావు లోనికిబోవ నుద్యుక్తుడై యుండెను. వెంటనే బైరాగి యీల వేసెను. తోడనే పోలీసులు వచ్చి కేశవుని బంధింపబోయిరి. కేశవరావు తన్ను బట్ట వచ్చువారిని తన బాహుబల ప్రదర్శనము గావించెను. వారును సరకుగొనక రెండుమూడు ప్రహారములు వానికి బదులుతీర్చి వానిని బొంబాయి నగరము తీసుకుపోయి కారాగృహబద్ధుని గావించిరి.

## 22

పాతాళగృహమునుండి నారాయణ రామనాథ్‌లు తప్పించుకు పారిపోయినట్లు మధ్యాహ్నము నాటి పదిగంటలకు చోరులకు తెలిసెను. వారు వెంటనే రహస్యమార్గముగుండా యరణ్యము నంతను కలయవెదకిరి. కాని నిష్ప్రయోజన మగుటచే తిరిగి తమ నివాసమును జేరిరి. మరునాటి యుదయముననే కేశవ రావును బంధీ జేసిన వార్త కాననమంతయు మారుమ్రోగెను.

తమ నాయకుడు పగతుర చేతుల బడినందులకు మిక్కిలి విచారించుచుండిరి. కేశవు డెట్లైన చెర తప్పించుకు రాగలడని వారికి ధైర్యముగా నుండెను. కాని మాధవుని పేరు జెప్పిన వారు హడలిపోవుచుండుటచే వాని బారినుండి తప్పించుకొన లేడేమో యని వానిని తప్పించు ప్రయత్నములు జేయ మొదలిడిరి.

"భైరవా! మనము నాయకుని తప్పించు ప్రయత్నమున జేయవలసినదేమి!"

"దుష్టబుద్ధీ! నాకొక యుపాయము తోచుచున్నది. అలనాడు నీతో జెప్పితినే? దానిని పూర్తి జేసినయెడల బాగుండునని తోచుచున్నది. అటుపిమ్మట దానిని... మాధవరావు... పట్టగలడా? ఏమందువు?"

చాల బాగుగానున్నదని చోరసమాజమునందు యేకగ్రీవముగా నంగీకరింపబడినది. వెంటనే వారు దానికి తగు ప్రయత్నములు జేయసాగిరి. కేశవుడు లేని కొరత లేకుండ చోరులామెకు సర్వసౌఖ్యములు జేయుచుండిరి.

* * * *

ప్రాతఃకాలముననే లేచి మాధవరావు కాలకృత్యములం దీర్చి సుమారెనిమిదిగంట లగుసరికి తన కార్యాలయమునకు జేరెను. తొమ్మిది గంటలకు నారాయణరావు, రామనాథ్‌లును కార్యాలయము జేరిరి. వారచ్చట గూర్చుండి యేదేదియో రహస్యముగా మాట్లాడుచుండిరి: అంతలో నొకడు వచ్చి

"మాధవరావుగారూ! మీకు దీనిని యిచ్చి రావలసినదని యెవరో యీ ప్రక్కవీధియందు యిచ్చినారు. దీనిని జాగ్రత జేసికొను"డని వెడలిపోయెను.

వారు లోనికేగి పెట్టెను తెరచిజూచిరి. దుర్గంధపూరితమయి అందొక స్త్రీ శిరము యంగవికారముగా చేయబడి యుండెను. ముక్కును, చెవులును జెక్కివేసిరి. అందుచే నది యెవ్వరో తెలియక మనమున చాల విచారించుచుండిరి. కేశవుని యరెస్టు చేసితిమని యిందిరను వరికియుండరుగదా! యని వారికి మన సాందోళనపడజొచ్చెను. ఎవ్వతెకొరకై తాను ప్రయత్నించుచుండెనో యామెయే యీమెయని నారాయణరావు భయపడియెను. మాధవరావు "నారాయణా! జూచితివా! ఈ హంతకుల క్రూరచర్యలు. నాకేమియు తోచుట లేదు. దీనిలో హంతకుడొక యుత్తరమునుగూడ బెట్టినాడు.

'మాధవరావుజీ!

నీవు మా నాయకుని పట్టినంతమాత్రమునకు మేము జడియువారము గాము. మా నాయకుని మే మెట్టులయినను తిప్పించుకొనగలము. మాతోడి విరోధమునకు గడంగవలదు.

ఇట్లు భవత్ శ్రేయోభిలాషి,
చోరశిఖామణి"

మాధవరావు సాయంకాల మగుడు తనబసకు పో జొచ్చెను. బోవుచు దారిలో నాటి హత్యా విషయమై పదేపదే తలబోయుచుండెను. ఆరుగంట లగుసరికి స్వగృహము జేరి భోజనముజేసి వీధి యరుగుపై విశ్రమించెను.

## 23

రాత్రి సుమారు తొమ్మిదిగంటల కిరువురు వ్యక్తులు రాజమార్గము గుండా బోవుచు యిట్లు సాంకేతికముగా తమలో దాము మెల్లగా మాట్లాడుకొనుచుండిరి. హత్య... పెట్టె... స్టేషన్... మాధవరావు....పట్టలేదు... భైరవుడు... ...భువనమోహిని యింట... కేశవుడు... యరెస్టు....తప్పించుకొనును లే... ... యనుచు మాట్లాడి యింకను యేమేమో మాట్లాడుకొను చుండిరి. తరువాత వారేమి మాట్లాడుకొనిరో వెనుకనుండి వారిని వెంబడించు వ్యక్తికి వినుపించలేదు.

వారట్లు పోయిబోయి నొక సందులోనికి ప్రవేశించిరి. మన వ్యక్తి వారికి ముప్పదిగజముల వెనుక నడచుచుండెను. ఆటాలున సందులో నొక మేడవద్ద యిద్దరు వ్యక్తులు నాగిరి. "మోహినీ! మోహినీ" యని తలుపుతట్టిరి. వయోరూప సౌందర్య లక్షణములు గలిగిన యొక యువతి తలుపు తెరచెను. ఇద్దరు వ్యక్తులును లోన ప్రవేశించి ఒకడు మేడక్రింది భాగమున కూర్చుండ, రెండవవాడు సౌధోపరిభాగమునకు పోయెను. మన వ్యక్తి చేయునదిలేక వీధి యరుగుపై బరుండెను.

"సఖీ! నీతో ముచ్చటలాడి చాలకాలమైనది. పంచశరు కేళి దేల నా మనము పురికొల్పుచున్నది కనుక యాలసించకు" మని పైకిబోయినవ్యక్తి యనెను.

"భైరవా! నీవీమధ్య నాపై శీతకన్నిడితివి. పక్షము రోజులీలోపున నాకొక రాగిదమ్మిడీ యిచ్చితివా?"

భైర: మోహినీ! యివ్వనిమాట నిజము. ఇప్పుడు నావద్ద యేమియు లేదు. ఈసారి వచ్చినపుడు తప్పక యిచ్చెదను. నీ పాట విని చాలకాలమైనది... ఏదీ! ఒక్క పాట... మోహినీ! దాహమగుచున్నది కొద్దిగా...

మోహిని: దారు తెమ్మందురా?

భైర: ఆ...ఆ... తెమ్ము.

మోహిని రెండు సారా కాయలను తీసికొనివచ్చి భైరవున కందిచ్చెను. భైరవుడు తప్ప త్రాగి మైమరచి యొడలెరుంగక గంతులిడుచు "మో...హి...నీ... యేదీ...ఒక్క ముద్దు... కౌగలి"మ్మని పైబడబోయెను. మోహిని తప్పించుకొనియెను.

కొంతవడికి భైరవుడు స్మృతికివచ్చి, "మోహినీ! నే బోవుచున్నా"నని మేడమెట్లుదిగి క్రిందికి వచ్చెను. క్రిందికి దిగి వచ్చుసరికి తనతో వచ్చిన వ్యక్తి పరుండి నిద్రించుచుండెను. "మిత్రమా! లెమ్ము. ప్రొద్దుపోయిన"దని వానిని లేపెను. ఈ యలజడి నంతను వినుచున్న యరుగుపై వ్యక్తి లటాలున లేచి పది గజముల దూరముననున్న యొక యరుగుపై జేరి, గుర్రుపెట్టి నిద్రవోవువానివలె బరుండెను. మోహిని తలుపుతీసి వాళ్ళను బైటికి పోనిచ్చి "భైరవా! మరచితిని. నీ వెప్పుడు వత్తు"వని పిలిచి యడిగెను. "మరల యీ వారమునాడు వచ్చెద"నని భైరవుడు జవాబిచ్చెను.

అంతట భువనమోహిని తలుపు గడియవైచి లోనికి పోయెను. మనవ్యక్తి సవ్వడిజేయక మెల్లగ లేచి యా యింటి నెంబరును తన డైరీయందు వ్రాసుకొని యటనుండి మెల్లగ భైరవుని వెనుక వెంబడించెను. ఏదియో యడుగుల చప్పుడు వినవచ్చిన భైరవుడు వెనుకకు తిరిగి విద్యుద్దీపికను ప్రసరింప జేసెను. ఎవ్వరును కన్పించలేదు. నిశ్చింతగా తమ దారిని వారు బోవుచుండిరి. మనవ్యక్తి వారిని వెంబడించుచుండెను.

అట్లు పోయిపోయి వారొక యడవి ప్రదేశమును ప్రవేశించిరి. అర్ధరాత్రి. మిన్నుమన్నేకమగునట్లు కారుమబ్బు పట్టెను. మార్గము దృగ్గోచరమగుట లేదు. కంటకశిలావృతమగు కారడవి. ముందువారు కరదీపిక సహాయముచేతను, వారికి నలిగినదారు లైన కారణముచేతను వడిగ పోవుచుండిరి. మన వ్యక్తి వారి నతికష్టముతో వెంబడించుచునే యుండెను. అట్లొక గంటకాలము నడచుసరికి వారు తమ నివాసమును జేరి తలుపు దట్టగనే దుష్టబుద్ధి తలుపు తెరచెను.

"దుష్టబుద్ధీ! నీవు నే జెప్పినట్లు నరాంతకుని సస్సైన్యముగ కేశవుని చెర దప్పింప బంపితివా?" యని యడిగెను. "అట్లనే జేసితిని. వారీపాటికి కేశవుని తప్పించియే యుందు" రని దుష్టబుద్ధి జవాబిచ్చి వారు తలుపు వేసుకొని లోనికి బోయిరి. ఇది వినినతోడనే మన వ్యక్తికి మన మాందోళనపడ జొచ్చెను. "ఔరా! వీరినిపట్ట పగ్గములున్నవా! కేశవుని తప్పించెదరా! కానిమ్ము" అని వెడలిపోయెను. పాఠకా! ఈత డెవరు? మన మాధవరావే.

## 24

ఇనస్పెక్టరుగారు కార్యస్థానము నకు రాకపూర్వమే దొంగలుపడి పోలీసు కర్మాగారము నంతను దోచి, కేశవరావును దొంగిలించు కొని పోయిన సంగతి తెలిసెను. అందుచే నారాయణుడు పత్తేదారునకు కబురుచేయగా యింటివద్ద లేరని తెలియుటచే సూర్యోదయమునకు పూర్వమే యాఫీసునకు పోయెను. పోవుసరి కంతయు చీకాకుగా నుండెను. కారాగృహపు తలుపులు తెరువబడి, బీటు రక్షకభటుడు చావుదెబ్బలుతిని యొకచో పడియుండెను. వెంటనే రక్షకభటుని వైద్యశాలకు బంపించి యీ హంతకుల దురాగతములు తలచుచు గూర్చుండెను. అట్టి సమయముననే సేవకు డరుదెంచి "అయ్యా! తమరు కార్యాలయము నుండి తిరిగి వెళ్లినపుడు మాధవరావుగారు రమ్మన్నా రండి" అని జెప్పి వెడలెను.

నాడు కార్యాలయమును పెందలకడ మూసి తాను ముందు జరుపవలసిన విధిని తెలిసికొనుటకై పత్తేదారునింటికి పోయెను. అచట వారు జరిగిన సమాచారములను రహస్యముగా మాట్లాడుకొనిరి. మాధవరావు యిరువురు రక్షకభటులకు కబురుజేసి "మీరు సత్వరము కల్యాణకటకమునకు పోయి మరల నేను వచ్చువరకు దాదాజీగారిని, యావదాస్తిని కడు జాగ్రతగా కాపాడుచుండు"డని యాజ్ఞాపించెను. వారు చిత్త మని బయలుదేరి పోయిరి.

* * * *

నాడు శుద్ధపంచమి. చంద్రవదనము ప్రొద్దుపోవు కొలది వాడుచుండెను. కారుచీకటి. మిన్నుమన్నేకమగునట్లు గాలిచే నాకులలము లెగురుచుండెను. చలిగాలి గాఢముగా వీచు చుండెను. అట్టితరి ముప్వురు వ్యక్తులు నెచ్చటికో పోవుచుండిరి. అప్పటికి రాత్రి సుమా రొంటిగంట కావచ్చినది.

వారట్లుపోయి యొక పెద్ద సౌధరాజముకడ నాగిరి. అది యెక్కుటకు వీలుపడనందున వారు త్రాటి సహాయమువ మేడ నెక్కగలిగిరి. మెల్లగ వారు మేడను కలయ[illegible] తలుపుల కొన్నింటి తెరచిరి. కిర్రుమని చప్పుడగుటచే యిరువురు వ్యక్తులు చేత పిస్తోలులు పట్టుకొని సౌధము నొకపరి ప్రదక్షిణము జేసిరి. కాని వారి కేమియు కనబడనందున వారుబోయి మరల యథా స్థానమున బరుండిరి.

నూతన వ్యక్తులు మరల మెలమెల్లన యొకగది జేరిరి. అందొక స్త్రీ చింతాదందహ్యమాన మా[illegible]యై నిద్రపట్టక బాధపడుచుండుట గని, గది తలుపు తె[illegible] యుం[illegible]టచే లోన ప్రవేశించి, యామెకు తెలియకుండగ బోయి గొంతు నదిమిపట్టి నాసికారంధ్రమున జేబురుమాలు వాసనజూ[illegible] క్షణకాలములో నామె స్పృహతప్పి పడియుండెను.

అచ్చటినుండి వారు దాని [illegible] గదియందు ప్రవేశించిరి. అందొక స్థూలకాయు[illegible] [illegible] చనుపై బరుండి యుండెను. అతని తల[illegible]క్రింది దిం[illegible] [illegible] చల్లగా నుండెను. కొంతవడి యాత డెద్దానినిగూర్చియో విచారించి యుండునని యూహించక తప్పదు. అతడు సుషు[illegible] స్థయుం డుంటుటచే యీ హంతకులు గది బ్రవేశించినజా[illegible] [illegible]ంగను. హంతకులు

నిర్ఘ్యయముగా వానికడకు బోయి నోటిలో నేదియో నాలుగు చుక్కలు మందును బోసెను. ముఖమునకు కన్నులు గన్పడకుండ దట్టముగా నొక గుడ్డ బిగించెను. స్పృహ లేదు. నోట మాటలేదు.

ఔరా! ఎట్టివాని కెట్టిగతి పట్టనున్నది. ఇందిరా చింతనమున దగ్ధమనస్కుడైన దాదాజీకా యిట్టి కడగండ్లు! దైవమా! కష్టములపై కష్టములుగల్పించి పరిశీలించుచుందువే. చోరులు సఫల మనోరథులగుటచే నిర్భీతిగా యూరుదాటి పవనవేగంబైన తురంగముల నెక్కి నిజనివాసమునకు జేరిరి.

## 25

తెల్లవారినది. కల్యాణ కటకమున దాదాజీగారి యింటితలుపు తీయువారు లేరు. దాసి పాచిపనులు చేయుటకువచ్చి వీధి గుమ్మముకడ బొబ్బలిడుచుండెను. ఆమెకు జవాబిచ్చువారు లేరు. మాలతివచ్చి తలుపువద్ద కేకలిడెను. కాని నిష్ప్రయోజన మాయెను. ఊరందరు నా సౌధముకడ గగ్గోలు పెట్టుచుండెను. పలువురు పలువిధముల పలుకజొచ్చిరి. ఇందిర నెత్తుకపోయిన దొంగలు వీరినిగూడ నెత్తుకుపోయిరేమో యని కొందరు భ్రమించిరి. ఎట్టకేలకు వారు సాహసించి వీధితలుపుతీసి జూచిరి.

ఏమున్నది? నిశ్శబ్దము. రెండవ యంతస్తున యిరువురు రక్షకభటులు చేతనాశక్తి లేక పడియుండిరి. వీరికిగూడ చోరులు తమ మంత్రముల ప్రయోగించియుందురని మన మూహింప

వలసి యున్నది. పై యంతస్తున దాదాజీగారిభార్య యొంటరిగా పరుండియుండెను. కండ్లకు గట్టబడిన గంతలను విప్పిరి. ఆమె శరీర మచేతనమైయున్నది. ఉచ్ఛ్వాస నిశ్వాసములు మాత్ర మున్నవి. అందుచే ప్రాణమున్నదని నిశ్చయించి యామెకు సర్వవిధముల శిరోపచారములు చేయసాగిరి. దాదాజీగారు పైని యెచ్చటను లేరు. అందుచే యనేకు లనేకవిధములుగా మాటాడజొచ్చిరి.

కొంతవడికి దాదాజీగారి భార్యకు స్పృహ వచ్చెను. మెలకువ వచ్చుసరి కిల్లంతయు గల్లంతుగా నుండెను. ఊరిలోని ప్రజలందరును దాదాజీగారి యింటిచుట్టు మూగిరి. దాదాజీగారి చెల్లెలు మెలుగెత్తి మంచి వరుసగా యేడ్వదొడగెను. నిజముగా నిట్లు జరుగునని యీమెకు తెలియును. ఎట్లైనను తన కుమారుని బాగె కోరినదిగాని యన్న చిన్ననాటినుండియు తన కష్టముల పాల్గొని తనను ముద్దుగా జూచుచుండెననియైన లక్ష్యము లేదు.

ఉదయము పదిగంట లగుసరికి మాధవరావు, నారాయణులు దాదాజీగారి యింటిముంగట ప్రత్యక్షమైరి. అంతయు విశదముకాగా వీరు లోనికేగి జూచుసరికి తమ రక్షకభటులు నిస్పృహులై పడియుండుట జూచి జేబులోనుండి యేదియో సీసా నొకదానిని వాసన జూపించిరి కొలది నిముసములలో వారు లేచి కూర్చుండిరి. అపుడు మాధవరావు వారిని యీ క్రిందివిధమున ప్రశ్నించెను.

"ఓయీ! మీకు రాత్రి జరిగిన సంగతి యేమైనా తెలియునా?"

"అయ్యో! యేదో చప్పుడగుటతోడనే మేమిద్దర మును సౌధము నొకపరి చుట్టివచ్చి యేమియు గాన్పింపమి మరల యథాస్థానమున బరుంటిమి. తరువాత యేమి జరిగినదో మా కణుమాత్రమును తెలియ"దని వారు జెప్పిరి. అంత వారు దాదాజీగారి భార్య నోదార్చి ఏమియు భయములేదు. నీ పతిని, నీ యనుంగు కూతును నీకు క్షేమముగ యప్పగించు భారము మాదని నారాయణ, మాధవులు ధైర్యముజెప్పి వెడలిపోయిరి.

దాదాజీకడ యిందిర యెంత చనువుగానుండెనో మాలతిగూడ నంత చనువుగానుండెడిది. అందుచే తననుగన్న తండ్రి గాకపోయినను తండ్రికంటెను నధికుడగు దాదాజీ తస్కరింపబడినందులకు మిక్కిలిగా వగచెను. ఎట్టులయినను తానుగూడ యిందిరాన్వేషణమునపాల్గొన నిశ్చయించుకొనెను.

## 26

నేడు భానువారము. గొప్ప మహోపకారము జరుగవలసి యున్నది. సాయంకాల మేడుగంటలైనది. యొక పురుషుడు తెల్లని గ్లాస్కోపంచ నొకదానిని కట్టి, పైనొక సిల్కుకమీజు తొడిగి, పైనొక కోటును వేసుకొని బొంబాయి నగర వీధుల విద్యుత్కాంతుల నడుమ మదనుడా యనునట్లు నడుచుచు పోవు చుండెను. అట్లాతడు రెండుమైళ్లదూరమ్ము పోయి యొక సందు లోనికి తిరిగెను. కొంతదూర మా సందుననడచి యొక సౌధము కడ నాగి యాతడు తలుపుతట్టెను. లోనుండి యొక వృద్ధవనిత వచ్చి తలుపుతీసెను.

ఈ నాగరిక పురుషుడు లోన ప్రవేశించినతోడనే యా వృద్ధవనిత తలుపు గడియవైచి "అయ్యా! పైకి దయచేయు" డని జెప్పి వానిని సవినయముగా పై యంతస్థునకు తీసుకుపోయి నొక కుర్చీపై నాసీనుజేసెను. అచ్చట నామెకూతురుగలదు. ఆమెపేరు భువనమోహిని. ఈమెను జూచినతోడనే నూతన వ్యక్తి కెట్లు పలుకరించవలెనో తెలియలేదు. ఈత డిదివర కిట్టి గృహముల కెప్పుడును బోయియుండలేదు. అందుచే యేమి చేయుటకును తోచక నిట్టూర్పు విడిచి కూర్చుండెను.

భువనమోహిని చెంబుతో నీటిని దెచ్చి కాళ్లు కడిగికొనుడని ముందుంచెను. నూతనవ్యక్తి చెంబుతీసికొని కాళ్లు కడిగికొనుటకై గుమ్మమవతల కేగగా ఈతడెవ్వడో భాగ్యవంతుని వలె నున్నాడు. ఇట్టివారు మా యిండ్లకు రానేరారు. వచ్చిరా నా భాగ్యము పండినదన్నమాటయే యని యేదియో నాలోచన నభినయించుచు నొక డ్రాయరుపై చేయి నానుకొని శృంగార ముట్టిపడునట్లు జేరగిలబడియుండెను. కాళ్లు కడగికొని లోని కేతెంచి కుర్చీయం దాసీనుడై "నీవేనా భువనమోహినివి" అనెను.

భువ: అవునండి. మిమ్ముల నెచ్చటనో గాంచినట్లున్నది!

నూ. వ్య: ఈ పురమునందే చూచియుండవచ్చు. నీవు పోలీసు సూపరింటెండెంటుగారి గృహమున వివాహమునకు మేళమునకు వచ్చితివి. అపుడు నేను నిన్ను జూచితిని. నీవు నన్ను బాగుగా నెరుగవు.

భువ: అయ్యా, తమ నామధేయమేమో యడుగ వచ్చునా!

మా. వ్ర : నన్ను మాధవరావందురు. నేనీయూర శోపరాధపరిశోధకోద్యోగిని.

భువ : నేటికీదీనురాలిపై నను గ్రహము గలిగెగాబోలు.

మా : లేదు. ఇదివరకే రెండుసార్లు రా బ్రయత్నించి తిని. కాని వీలు జిక్కినదికాదు.

భువ : అవును. మనసు పుట్టినతోడనే... మావంటివారి యిండ్ల కేలవత్తురు. యీ ప్రక్కవీధియందు నివసించు నవరత్నము, పుష్పము, చంద్రభాగ, భువనసుందరి వీరలవలె నే నేమంత యగడమైనదాననా!

మా : అబ్బే అదికాదు. నీవు భైరవుని తప్ప యన్యుని వరింపవని.

భువ : ఆదరించక పోవుటా! ఏమి భైరవుడేమి ధనమును గురిపించుచుండెనా!

మా : నీ కతనియం దయిష్టమున్నదని తెలియవచ్చియే నేనిటకు వచ్చితిని.

భువ : మీ కేనా యింకెవరికేనా యీ సంగతి తెలిసినదా? భైరవునకు తెలిసెనేని నాపని మట్టమే.

మా : వెర్రిదానా! అది నేనుమాత్ర మెరుగనా. నీ ప్రాణములమీదికి తెప్పించుపని నేను చేయుదునా? నీ కా భయ మక్కర లేదు.

భువ : మీరు వచ్చునట్లుగానే యిదేమి పాపమో భైరవుడు నేడు వచ్చెదని కబురుజేసినాడు. ఎప్పుడు వచ్చునో— ఇది యాతడు గాంచిన ప్రమాదకరము. ఈ శనిగ్రహము నన్ను వదలకున్నది.

'ఈమె నన్ను బాగుగా నమ్మినది. దీని కనుగుణ్యముగా వర్తించి నా కార్య సాఫల్య మొనర్చుకొందు'నని మనసున దలపోసి "మోహినీ! నీవు నే జెప్పినట్లు జేసినచో భైరవుని మరుక్షణమున నీ చుట్టుపట్ల లేకుండ జేసెదను. అయ్యది నీ సాధ్యములో నున్నదియే. చెప్పుమందువా?

భువ: ఆ... జెప్పుము... అవశ్య మట్లు చేయుదును.

మా: నీవు వానిచే మిగుల ద్రావించి యొడలెరుంగని స్థితికి తీసుకురమ్ము. తరువాత నా శక్తి జూడుము. నీవద్ద దారునకు ధనములేకున్నచో తీసుకొనుమని పదిరూపాయలు చేత తీసి యీయబోయెను.

భువనమోహిని "వలదు. వలదు నావద్ద దారున్నది" అని జెప్పెను. ఈయబోయి మరల చేయి వెనుకకు లాగుట యుత్తమకుల సంజాతుల లక్షణముగాదని యామె కిచ్చివేసెను. ఈలోపున వీధితలుపు చప్పుడగుటచే మాధవుని చెవిలో నేదియో రహస్యము జెప్పి వాని నొక గదిలో గూర్చుండ నియమించి తాను తలుపు తీయుటకై పోయెను. భైరవుడు లోన ప్రవేశించెను.

భైర: మోహినీ! చాలరోజులైనది. మన్మథుడు తన వాడిశరముల గాఢముగ నాటుచున్నాడు. నా కాలవిళంబన కారణము తెలుప రెండురోజులు పట్టును. రేపటెల్లుండి జెప్పెదను. దానికేమి... దాహమగుచున్నది...

భువ: దారు తెమ్మందురా?" యని రెండు కాయలను తెచ్చి యివ్వగా భైరవుడు ద్రావి యొడలెరుంగక గంతులిడ జొచ్చెను.

భైర : మో...హి...నీ...ఒక్క...పాట...పాడుము.

భువనమోహిని మరొక్క దారుకాయ నందిచ్చి, కుర్చీయం దాసీనయయ్యెను.

భైరవుడు ఒడలు తెలియక క్రితము జరిగినవన్నియును యాకరువు పెట్టుచుండెను. "నేను...పది...రోజులు...రామ్ సింగ్ మహాశయుని...కూతురును...మందా...రవతి......హత్య..." అని యేమేమో పలుకుచు క్రింద బడిపోయెను.

మోహిని లోనున్న మాధవుని పిలచెను. మాధవు డరుదెంచి యీలవేయగా రక్షకభటులు నల్వురువచ్చి వానిని యరెష్టుజేసి కారాగృహమునకు గొంపోయిరి. మాధవుడు తాను వచ్చినపని పూర్తియగుటచే మరలవత్తునని మోహినితో జెప్పి తన దారిని తానుపోయెను.

## 27

"ఔరా! నీ చేతలు దురవగ్రాహ్యములు. సుఖసంపదనార్థము మానవు డెన్నిరీతుల ప్రయత్నించినను నీశ్వరేచ్ఛ ననువర్తించి కార్యఫలంబు లభించుచుండును. చిన్ననాటినుండి పెంచి పెద్దజేసి నా యిందిరను తస్కరుల కప్పగించితిని. హా యిందిరా!" యని మూర్ఛిల్లెను. కొంతవడికి దాదాజీ కన్నులు తెరచి జూచుసరికి యెదుట కేశవుడు ప్రత్యక్షీకరించెను. "కేశవా! నీకిదితగునా! కులమానహీనుడవై నీవిట్లు జేయ తగునా? నీకు దప్పక వివాహ మొనరునని నే జెప్పలేదా? కొంచమైన యాలోచన జేయలేక బోతివే" యనెను.

కేశ : మామా ! నీవు నాకు బుద్ధులుగరుప నిచ్చుటకి తెప్పించలేదు. నేనొక కార్యార్థమై నిన్నిచటికి తెప్పించితిని.

దా : అదేట్టిది ? ఇందిర క్షే... ను... మా ?

కేశ : నాకావిషయ మెట్లు తెలియును ?

దా : నీవు దొంగిలించితివని మాధవరావు మహాశయుడు జెప్పెను.

కేశ : మాధవుడు ... నా దెబ్బ రుచిజూచి యెరుంగడు. నేనొక ప్రశ్న యడుగుదును. దానికి తగు సమాధాన మీయవలెను. నేను ఇందిరను చిన్ననాటినుండియు ప్రేమించియుంటిని. ఆమె నన్ను నా బొందెలో ప్రాణము లుండువరకు వివాహమాడనని తన నిశ్చితాభిప్రాయమును వెలిబుచ్చినది. నీవామె కెట్టిబోధనైన గావించి నన్ను పరిణయమాడునట్లు జేయుము. లేకున్న నిన్నును, యామెనుగూడ ఛండికాసదనంబున బలి యివ్వక తప్పదు. ఏమందువు ?

"కేశవా ! ఎంతటి యకార్యమునకు గడంగితివి. నన్ను పరిణయమాడనంతమాత్రాన శిరచ్ఛేదమా? హా పరమేశ్వరా!" యని దాదాజీ వేడినిట్టూర్పు బుచ్చి యీ విధముగానైనను యిందిరను జూచుభాగ్యము కలిగెనని సంతసించుచు "అటులనే ప్రయత్నించెదను" అని పలికెను.

అంత కేశవుడు తన మేనమామను యిందిరయున్న గదిలో ప్రవేశబెట్టెను. ఒకనికితోడిద్దరు వచ్చుటచే యిందిర భీతచిత్తయై "మూర్ఖా ! మరల వచ్చితివా" యని తొకత్రొక్కిన తాచువలె చర్రునలేచెను.

"అమ్మా! యిందిరా, యిందిరా" యని కన్నుల నశ్రులు వాల దాదాజీ క్రింద పడిపోయెను. ఇందిర తన తండ్రి యని మాటనుబట్టి గ్రహించెను దాదాజీ సేదదేరి "యిందరా నా తల్లీ!" యని యామెను డాయజేరి ప్రియంబార కౌగిలించెను. ఇందిర కన్నీరు కాల్వలై పార యాతని పాదద్వయంబు నశ్రు ధారలచే ప్రక్షాళనము గావించెను. "అమ్మా! ఎన్నాళ్ళకు నా కంట బడితివి. మరల నినుజూచు నోము నోచనైతినిగదా యని మిక్కిలి విచారించితిని. నాకును నీకు గలిగిన విపత్తే వచ్చుటచే నిను జూడగలిగితిని" అని విచారించెను.

"తండ్రీ! నీకును నాకుపట్టిన కారాగార ప్రవాసమే యబ్బెనా?"

"అమ్మా! నన్నిక్కి కారణముపై కేశవు డిటకు తెప్పించెనట. అది... జెప్ప నోరు రాకున్నది... యిందిరా! నీవాతని వివాహంబాడ నిరాకరించితివట. కనుక నేను నీ కేవిధముగ నైన బోధించి నీ మనమును త్రిప్పి యాతనికి నిన్ను పాణిగ్రహణముజేయునటెనట. లేనిచో నిన్నును నన్నును గూడ కాళికి బలియిత్తురట"

"తండ్రీ! త్రికరణశుద్ధిగ నొకని వరించి మరల నింకొకని వరించుట పతివ్రతల లక్షణమా! అదియునుగాక కుల మాన గుణహీనుని నే వరింప నిచ్చగింతువా! తండ్రీ! అర్థములు నిత్యములుగావు. గుణమా కులమా? ఏది ముఖ్యము? నేనేమి కులహీనుని వరించుట లేదే! అతడును రూపగుణ సంపన్నుడు. ఇపుడు పోలీసు శాఖలో సబుయినస్పెక్టరుగా పనిచేయుచున్నాడు. కేశవునివంటి గుణహీనుని చెట్టబట్టి పలు

యిమములు గూడుచుటకంటె, సత్కులజుడును గుణరూప శీల సంపదల నద్వితీయు డగువానినె వరించి సుఖింపరాదా? తనను వివాహమాడలేకున్న నాకు శిరచ్ఛేదమా? వానిని పరిణయ మాడుటకన్న నదియే మేలు. కావుననోతండ్రీ! నీవు నాకై విలపింపకుము. యిందిర యిక లేదనియే భావించుము. ఇందిరను నీవు కనలేదని మనసు దృఢపరుచుకొను" మని తన మనో నిశ్చయమును తండ్రి కెరుకపరచెను.

దాదాజీ మారు పలుకలేకపోయెను. ఆమె పలికిన ప్రతిమాటయందును యెంతో విలువయున్నది. అందుచే యామె కేమి జవాబు జెప్పుటకును తోచలేదు.

## 28

"ఈశ్వరానుగ్రహమున్న యెడల మన కార్యము తప్పక సిద్ధించును. చెరయందు బంధింపబడిన దాదాజీ యెట్లున్నవాడో? వానిని ప్రాణములతో నుంచిరో లేక ... దాదా యీ దుర్మార్గుల చేజిక్కి సజీవుడై యుండెనా? యని సంశయించుచుంటి"నని యొక వ్యక్తి యనెను.

"నారాయణరావుజీ! అట్లెన్నటికిని జరుగదు. సజీవు డయియేయుండును. దాదాజీ గారితో కొంచము కపటనాటక మాడుటకై కేశవుడాతని బంధించి యుండునని" మరొకవ్యక్తి యనెను.

"ఔను. నాకును నట్లే తోచుచున్నది. పత్తేదారుజీ! మనము సుమారుగా చోరులు నివసించు ప్రదేశమునకు వచ్చి యున్నాము. జాగరూకులమై ప్రవర్తింపవలయు"నని రామనాధ్ పలికెను.

వారి దృక్పధములందాక వెల్తురు గానవచ్చెను. ఆ మంట వెలుగున నొక సుందర విగ్రహము తళతళ మెరయు చుండెను. వీరు ముగ్గురును యచ్చోటికి బయలుదేరిరి. వీరిని జూచినతోడనే యా వ్యక్తి మీది ప్రాణములు పై కెగిరిపోవు నంతటి భయముదయించెను. ప్రాణత్యాగమునకు సైతము లెక్క చేయని యా వ్యక్తికి ధైర్యము జిక్కబట్టి "అయ్యా! మీ రెవ"రని యడిగెను.

మాధ: మేము బాటసారులము. నీ వొంటిగ ఈ కానన ప్రాంతమున కెట్లు రా గలిగితివి!

వ్య: అయ్యా! తమరెవరో నన్నుద్ధరించ వచ్చిన మహాపురుషులవలె నున్నారు. నేనొక కార్యముపై యీ ఘోరాటవియందు ద్రిమ్మరుచుంటిని.

మా: అదెట్టిది? నీ వణుమాత్రంబును సందియముపడక జెప్పుము. మాచేనైన నుపకారము బడయగలవు.

వ్య: అయ్యా! నేను కల్యాణకటకగ్రామ నివాసిని. నా తండ్రి నా చిరువయసునందే స్వర్గమున కేగెను. అది మొదలుగా దాదాజీగారను మహాధనికుడు మా కుటుంబమును పోషించుచు, నన్ను ముద్దుగా తన యనుంగుతనయ ఇందిరతో తుల్యముగ జూచుకొనుచువచ్చెను. సుమారు నెలరోజులక్రితము

యిందిర తస్కరుల ధనమైపోయెను. యీమధ్యను మా తండ్రి యగు దాదాజీగూడ... (యని కన్నుల నశ్రులురాల నేడ్చుచు నిలువబడెను)

మా : నారాయణ్ జీ! యీ వ్యక్తి చూడగా పురుష వేషమున నున్న స్త్రీగా తోచుచున్నది. ఈమె తన మానరక్షణార్థ మిట్టి యవతారము దాల్చియుండును. ఓయీ! నీకేమియు భయములేదు. తరువాత...

వ్య : అబలనగు నేను మానధన రక్షణార్థ మీ వేషము వైచి వారి నన్వేషించుచు యిట్లు తిరుగుచున్నాను.

మా : అమ్మా! నీ పేరేమి?

వ్య : నన్ను మాలతి యని పిలుతురు. అయ్యా! తమ రెవరో యెరుగవచ్చునా?

మా : మేము మువ్వురమును యీ చోరుల బంధించు నుద్దేశ్యముననే తిరుగుచున్నాము. మేము పోలీసు శాఖలోని యుద్యోగులము. నీవును మాకు తోడైయున్నచో కడు సులభముగా వారిని బంధింపవచ్చును.

మాల : అయ్యా! తమ సెలవు.

మా : అమ్మా, మాలతీ! నీవు నే జెప్పినట్లు ప్రవర్తించ వలయును. నీవు నీ నిజరూపమున యీ తిన్నగ బొమ్ము. నీవా చోరుల ప్రదేశంబు ప్రవేశించినను నెగ్గేదియు సంభవించదు. మేము మువ్వురమును నిన్నా చోరగృహమున గలుసు కొందుము. మేము వచ్చునంతలో సర్వ రహస్యంబులను నీవు తెలుసుకొనుము. అందుమీద సంగతి సందర్భంబులను విచారించి కార్యమును నడుపవచ్చును.

ఆ యుపాయము ననుకూలముగా నున్నందున అందరును మిగుల సంతోషించిరి.

మాలతి, మాధవరావు వాని యనుచరులు జెప్పినట్లు పురుష వేషమును త్యజించి జగన్మోహిన్యవతారమునుదాల్చెను. తన సురియను పయ్యెదలో జాగ్రత జేసెను. ఆమె వాల్చూపుల యందేమి మత్తుమందు కలదోగాని మన రామనాథ్ హృదయ మందు ప్రేమాంకుర బీజములు నాటెను. మాలతి కనుచూపు మేర వరకును వెనుదిరిగి జూచుచునే యుండెను. ఆమెకును రామనాథ్ యందు ప్రేమాశాబీజస్థాపనమాయెనని యూహించ వలసియున్నది. దృష్టి పోవువరకు నొండొరుల నొకరొకరు వెనుదిరిగి జూచుచు నేయుండిరి. తప్పనిసరి యగుటచే మాలతి యొక వేడి నిట్టూర్పు విడచి వనమధ్యమున నొంటిగ బోవు చుండెను.

పొదలను మెలమెల్లగ తప్పించుకొనుచు లతానికుంజ పుంజముల సుమంబుల గోసి తన వాల్జెడయందిడి యొయ్యారముగ నడచుచుండెను. అంతలో వెనుకభాగమున నేదియో మానుష సంభాషణ వినవచ్చెను. వెనుకకు దిరిగి జూచెను. ఏమియు గనిపించలేదు. మరల నడుచుట ప్రారంభించెను. వెనుక నామెను వెంబడించుచున్న వ్యక్తులు నామెను బంధింప బోయిరి. ఆమె వారి భీకరాకారములు జూచినతోడనే యొడలు కంపించెను. గద్గదస్వరముతో "మీ రెవర"ని ప్రశ్నించెను.

"మేము యీ వనరాజుయొక్క భటులము. ఎవ్వరును మా యనుమతి లేనిది చొరరాదు. ఉల్లంఘించినవారు కారాగృహవాసు లగుదురు" అని జవాబిచ్చిరి.

"అటులనా? నన్ను ముట్టినచో మీకు నరకప్రాప్తి కలుగును" యని మాలతి వారిని భయపెట్టెను.

వారొక యబలా వాగ్ధాటికి వెరగందువారా? కనుక నామాటలు సరకుచేయక ఆమెను బంధించిరి. మాలతియు కారాగృహమునన్వేషింప వచ్చియుండుటచే మారుమాటాడక వారు తీసుకుపోవు చోటునకు పోవుచుండెను అట్లు వారొక యంమైలు దూరము నడచిన తరువాత వారామె కన్నులకొక గుడ్డను గంత కట్టిరి. ఒక పొదలోనికేగి మీటనొక్కగా యచ్చటొక తలుపు తెరచుకొని ద్వార మేర్పడెను. ఈ చోరు లామెను కడు జాగ్రతతో యా ద్వారముగుండా తీసుకుపోయిరి. కొంచముకొంచముగా వెల్తురు వచ్చుచుండెను. అట్లు కొంత దూరము ప్రయాణము జేసిన తదుపరి వారొక గృహమునకు జేరిరి. అందాసీనుడై యున్న తమ రాజునకు యీమెను జూపగా వెంటనే యాతడు మాలతి యని గ్రహించెను.

మాలతియు నాతని జూచినతోడనే కేశవుడని గ్రహించెను. అప్పుడు మాలతి వానితో నీ క్రిందివిధముగా సంభాషించెను.

మా: అయ్యా కేశవరావుజీ! నిన్ను నేను చిన్ననాటినుండియు నెరుంగుదును. నన్నును నీవట్లే యెరుంగుదువు. నన్ను నీ యనుచరులట వీరు బంధించిరి. నేనిందిరాన్వేషణమున బయలు దేరితిని. యిందిర నాకనుగవకగపడిన యిహపరములీయజాలు మేనరిక మొల్లకుండుట తప్పని యామెకు బోధించి నిన్నెట్టులైన పరిణయమగు నాపాయమాలోచింప యిలు వెడలితిని. నాకు వీరెక్కడ దాపురించిరి... నన్ను బంధవిముక్తనుగా జేయ ప్రార్థన

కేశ : మాలతీ! ఎంత జెప్పినను యిందిర నామాట పెడచెవిని పెట్టినది. తత్ఫలం బనుభవించును.

మాల : కేశవా! ఏమి నీమాట పెడచెవినిడుటా! పిన్ననాటినుండియు మా బావనే పెండ్లాడుదునని జెప్పుచు వచ్చినది. నేను నిజమే యనుకొంటిని. మీ మేనమామకు గూడ నీవన్న నే మిక్కిలి యిష్టము గలదు. ఔనుకాని, యిందిర యెచ్చటనున్నది? నాకొకపరి జూపింపుము. ఇది నీకు తగదని బుద్ధిజెప్పెదును.

కేశవు డిదియంతయు నిజమేయని భావించెను. చెప్పెను కాబోలునని యామెను తన పరిచారికయగు కేశినితో యిందిరా దాదాజీలు గల గృహమును ప్రవేశపెట్టమనియెను. ఆ దారు లన్నియు మాలతి సులువుగా కనిపెట్టెను. లోనున్న యిందిర మా ల తి ని జూచుటతోడనే ఆశ్చర్యనిమగ్నమానసయై యామెను కౌగిటజేర్చి "మాలతీ! యెన్నాళ్లకు నిన్ను చూడ గలిగితిని. నీవిట కెట్లురాగలిగితివి మాలతీ?" యని ప్రియంబార యడిగెను. "నే వచ్చిన కార్యము సాఫల్య మొనర్చువరకు నీవు నే జెప్పినట్లు నడువవలసియుండును. నీ కపకారమేదియు జరుగజాలదు" అని తన కార్యక్రమము పూర్తిగా తెలియ జేసెను. యిందిర తప్పక చేయుదుననియెను.

కేశిని బయటకువచ్చి గుమ్మమవతల గూర్చుండి యుండెను. లోపల మాలతీ, యిందిరా, దాదాజీలు యేమియో గుసగుసలాడిరి. ఒక యరగంట యయినతరువాత మాలతి లోనున్న మీట నొక్కగా చిత్రముగా తలుపు తెరువపడెను. తా నీవలికి వచ్చి మరల మీట నొక్కెను. తలుపు మూసివేయ

బడెను. కేశినీ మాలతులు బయలు వెడలి కేశవరావు కడకు వచ్చిరి. మాలతి జరిగిన సంభాషణ నంతను పూర్తిగా జెప్పి నే నెట్లైనను రెండు దినములలో కార్యసాఫల్య మొనర్తునని వాగ్దాన మొనర్చెను.

అంత కేశవుడు కనుసైగ చేయగా కేశిని మాలతిని యొక గదియందుంచి బైట బీగమువైచెను.

## 29

ఉదయమున రమారమి తొమ్మిదిన్నరగంటలు కావచ్చినది. ఆత్రుతచే సాయంకాలము వరకు నాగలేక నొకసారి చూడమని కేశవరావు యిందిరా మందిరమునకు బయల్వెడలెను. దలుపు దెరచికొని లోన ప్రవేశించెను. మంచముపై శయనించియున్న యిందిర లేచి నిలువబడెను. 'ఓహో! ఇందిర దారిలోనికి వచ్చుచున్న'దని మనమున సంతోషించుచు "యిందిరా!" యని పిలిచెను. ఇందిర జవాబేమియు జెప్పక లజ్జావనిత వదనమై చిరునగవు పెదవుల నలంకరింప యొకచో కడు నొయ్యారముగ నిలువబడియుండెను.

కేశ : ఇందిరా! నాకడ నీకింత సిగ్గేల? నా మనంబు భవదీయాశ్లేష సౌఖ్య కుతూహలాయత్తచిత్తమై యున్నది. ఆలసించిన తాళజాలను. మరుడు తన యడిసాయకమ్ములచే నను పురిగొల్పుచున్నాడు.

ఇం : కేశవా! వివాహమగుదనుక తాళలేవా? ఇపుడు వలదు. అది శాస్త్రసమ్మతమగునా?

యిందిర మాటలు కేశవుని మనసునకు కొంచము కష్టముతోచెను. కాని సాయంకాలము వివాహమైనతరువాత నిరాటంకముగ తనసొత్తు కానున్నందున తన యిచ్చవచ్చినరీతి యానందాంబుధి నోలలాడవచ్చునని మనము దిట్టము జేసుకొని "యిందిరా! నీ యలంకారములన్నియు నావద్ద జాగ్రతగా నున్నవి. వానిని కేశిని తీసుకువచ్చి నీకిచ్చును. నేను కొన్ని రత్నాలంకారముల జేయించితిని. వానిని నీ నెమ్మేనినిండ నలంకరించుకొనుము. నే బోయెదను. తెలిసినదా!" అనెను.

ఇందిర "అటులనే" యని జవాబిచ్చెను.

కేశవుడు వెడలినదాది యిందిర మనోవ్యాకులతచే బాధపడుచుండెను. ఈ కారణము చదువరు లూహించియే యుందురు. ఇందిర ప్రసరింపజేసిన చిరునగవుసందలి యర్థమును కేశవుడు గ్రహింపలేక వెర్రియై నిజముగ నిందిర తనను మనఃపూర్వకముగ ప్రేమించెనని తలచి కేశినిచే యాభరణముల నన్నింటిని పంపించెను.

వివిధద్వ్యలంకారముల నలంకరించిన యిందిర ప్రత్యక్షలక్ష్మివలె నుండెను. కేశిని యామె లలాటమున కస్తూరికాతిలకముంచెను. నిజముగ నామె సోయగ మెంచ నాదిశేషునికి సైతము శక్తి చాలదనుటయం దతిశయోక్తి లేదు. సాయంకాల మగుకొలది నారాయణనామ మంత్రోచ్ఛారణ మెక్కుడగుచుండెను.

"కేశినీ! నీవుపోయి మాలతి నొకసారి యిటకు దోడ్కొనిరమ్ము" అని యిందిర పలికినతోడనే కేశిని భయ సంభ్రమములతో "అట్లనే తల్లీ!" యని వెడలెను.

* * * *

మాధవరావు సుమారు పదిగంట లగుసరికి తన కార్యాలయమునకు జేరెను. రామనాథ్, నారాయణులు తమ స్వగృహములకేగి పదిన్నర గంటలకు మాధవరావుగారి కార్యాలోచనా మందిరమునకు విచ్చేసిరి.

మా : నారాయణా! మనము యీ దుస్తులతోనున్నను మన భటులు దొంగలు వేసుకొనెడి దుస్తులు ధరించకున్నచో యనవసరముగ చంపబడుదురు.

నారా : పరిశోధకాగ్రేసరా! మీకు నేను జెప్పవలయునే! అటులనేగానిండు. వారిలోవారు గుర్తించుకొనుటకు మాత్రము వారికొక చిహ్నమేదైన యీయవలసియుండును.

రామనాథ్ : అట్లు జేసిన ననుకూలముగ నుండునని నాకును తోచుచున్నది.

మాధ : నారాయణజీ! మనము సాయంసమయ మగుసరికి యచ్చటికి చేరవలయును. ఇందిర మనము రామను నిరాశచే బెంగగొనియుండును. అందుచే ముందుగా పోయి మనము వచ్చినటుల తెలియజేయవలయును.

నారా : అదియే బాగుండునటుల తోచుచున్నది. మనము మన రక్షకభటుల సిద్ధముజేసికొని అయిదుగంటల కిచటి నుండి బయలుదేరవలయును. కనుక పెందలకడనే భోజనము గావించి మరల మనమందర మిచ్చటనే కూడవలయు" నని వారు నిశ్చయించుకొనిరి.

## 30

కేశవరావు కాళికాలయము ముంగట నొక పెద్ద పందిరి నేర్పాటు జేయించెను. దానియందు కాగితములతో నానా విధములగు లతలు బుట్టలు కట్టించి పందిరి యంతయు నెంతో శోభస్కరముగ నలంకరించెను. మంగళప్రదమగు లేమావి బొమ్మల దెప్పించి వానినొక త్రాటికి గ్రుచ్చి వ్రేలాడ దీయించెను. పేరెన్నికగన్న వేశ్యాంగనల మేజువాణి నేర్పాటు జేసెను. నిజముగ నచ్చట కన్నుల పండువగయుండెను.

సాయంకాల మగుకొలది కేశవున కాత్రుత మెండగు చుండెను. ఇందిరాదేవికి విచార మెక్కువగుచుండెను. తన మనోనాథుడగు నారాయణుడు యనుచరులతో వచ్చి తన్ను రక్షించునో, రక్షించజాలడో యని మనమున ఖేదమందు చుండెను. తప్పక వచ్చి నిన్ను గొంపోవునని దాదాజీ, మాలతులు నామె నోదార్చుచుండిరి.

దివాకరుడు నియమితకాలమున కేగకున్న నిశాకాంత రానివ్వదనికాబోలు పశ్చిమదిశయందు గ్రుంకుచుండెను. కొలది కొలదిగ జీకటు లలముకొనుచున్నవి. ఇందిరా మనో పద్మముగూడ నంధకార బంధురమాయెను. ఆమె కేమియును తోచుట లేదు. మనసు చంచలమగుచుండెను. ఎచ్చట కాలి చప్పుడు వినబడినను యెవరో తనను వివాహవేదికకడకు గొంపోవ వచ్చెడినని తలచుచుండెను.

"హా దైవమా! సర్వభారమును నీపైనుంచితిని. నను నీట ముంచినను, పాల ముంచినను నీదే భారము. నన్నీ కటిక రక్కసుని పాల్జేసి యేమిచేయదలచితివో! ఆర్తరక్షణ బిరుద మును వృధగావింపకుము. దయాసింధూ! నాపై నీ దయాదృష్టి నొకపరి ప్రసరింపుము" అని యతి దీనముగా ప్రార్థించు చుండెను.

చోరులెల్ల రత్యుత్సాహమున కాననమంతయు గగ్గోలు పెట్టుచుండిరి. ఏడుగంటలైనది. ఇందిరను శాంభవీమందిరమునకు దోడ్తేర కేశినివచ్చి తలుపుతీసి లోన ప్రవేశించెను. "అమ్మా కేశినీ! నానాధుని జాడ లేమైన తెలిసినవా?"

"ఆ తెలిసినవి. ముందొక యనుచరుడు వచ్చి వారు వెనుక వచ్చుచున్నట్లు తెలియజెప్పినాడు" అని కేశిని బదులు జెప్పెను. ఈమెకూడ వీరిని గూడుకొనియే యుండెను.

"నిజముగా వచ్చుచుండెనుగా. అటులైన ముహూర్తపు వేళకు తప్పక రక్షింపబడుదునా?"

"తప్పక"

కాళి కోవెల పాతాళగృహమునకు సుమారొక మైలు దూరమున నున్నది. ఇందిర నొక సవారియందు గూర్చుండజేసి నలువురు బోయీలు మోయుచుండిరి. ముప్పది నిమేషములలో వివాహ మంటపమును జేరిరి.

కేశవరావు పీటపై కూర్చుండియుండెను. పురోహితుడు యిందిరను పీటపై కూర్చుండుమనెను. ఇందిర పులకాంకిత దేహయై యేమి చేయుటకును తోచక నిశ్చేష్టయై నిలువబడి పోయెను.

వివాహమండపము చుట్టును చోరులు జేరియుండిరి. వారియందుననే పోలీసు శాఖోద్యోగీయులుగూడ మారు వేషములతో చోరులలో నైక్యమై గూర్చుండిరి. రామనాథ్, నారాయణ, మాధవరావులు మంటపమునకు నాలుగు గజముల దూరమున గూర్చుండియుండిరి. వీరును చోరుల దుస్తులనే ధరించిరి.

అట్టి సమయాన "యిందిరా! కూర్చుండవేమి" యని సభ మధ్యనుండి యొక కేక వినవచ్చెను. అట్టి సమయమున నిర్వేతుక జాయమాన కటాక్షమును జూపుచున్న వారెవరాయని భయవిస్మయములతో యిందిర యానైపు జూచెను. నారాయణు చేసన్న చే గూర్చుండుమని జెప్పెను. ఇందిర పీటపై నాసీనయైనది. పావకుని ప్రజ్వరిల్లజేసి బ్రహ్మగారు మంత్రోచ్చారణ మొదలుపెట్టిరి.

ఇట్లు కొలది నిముషములు జరుగుసరికి సభలో కలకల మారంభమాయెను. చోరులు వారిలోవారు కొట్లాడుకొన జొచ్చిరి. అదియే తరుణమని నారాయణ, రామనాథ్‌లు చోరనాయక వైపునకు ప్రాకిరి. తటాలున నిలువబడి మాధవుడు రెండు చేతుల పిస్తోలులు ధరించి కాలరుద్రునివలె మండిపడుచు "కేశవా! ఆగుము. మాటాడిన నీ ప్రాణములు దక్కవు. జాగ్రత" అనియెను.

కేశవుడు యేమియు చేయలేక నిర్విణ్ణుడై పోయెను. ఇట్లు జరుగునని కలనైనతలచలేదు. కాళ్లు గడగడలాడు చుండెను. గుండె మహావేగమున గొట్టుకొనుచుండెను. ధైర్యము నవలంభించి "ఓరీ! నీవెవడవు?" అని గంభీరముగ బల్కెను.

"నేనా! నీ పాలిటి మృత్యువును" అని మాధవుడు జవాబిచ్చెను

కేశవుడు మెల్లగ మొలలోనుండి రివాల్వరును తీయ ప్రయత్నించుచుండుట గాంచి నారాయణుడు వాని కరమును బట్టుకొని శృంఖముల దగిల్చెను.

దుష్టబుద్ధి, మిత్రఘ్నుడు మొదలగు నాయకులు పరువిడ ప్రయత్నించిరి. రామనాథ్ ససైన్యముగ సిద్ధముగ నుండుటచే వారిని వెంటనే బంధించెను. ఈ హడావిడిలో పౌరోహితుడు కాళ్లకు బుద్ధిజెప్పెను. చోరులు కొందరు దిరుగుబాటుజేసిరి. వారిని తమరివాల్వరులను గాలిలో ప్రేల్చి బెదరగొట్టిరి. సుమారు నాయకుని సహితముగా ముప్పదిమంది చోరశిఖామణుల శృంఖలాబద్ధుల గావించి బొంబాయి నగరమును జేర్చిరి.

పాతాళగృహమున బంధింపబడిన పోలీసు జవానులను విడిపించి వారిని బొంబాయి తీసుకువచ్చిరి.

యిందిర, మాలతి, కేశినులు పత్తేదారు మాధవరావు గారి యింటివద్ద విడిదిచేసిరి.

## 31

భైరవుడు యిదివరకే భువనమోహిని యింట బంధీ చేయ బడెను. మిగత చోరనాయకులు, కేశవరావు, దుష్టబుద్ధి, మిత్రఘ్నుడు, గోవిందుడు మొదలగువారు యావన్మందియు యిపుడు బంధీలైరి. వీరిని పరీక్షజేసి తగు బహుమతుల నీయ వలయునని మాధవరావు జెప్పెను.

మరునాటి యుదయమున మేజస్ట్రేటు నెదుటకు చోర శిఖామణుల నందరను తీసుకువచ్చిరి. చుట్టును పోలీసు సిబ్బంది యుండెను. జనసమూహములు కోర్టుచుట్టును మూగియుండిరి. గజదొంగలను బట్టియుండుటచే వారిని జూచుటకును, తీర్పు వినుటకును తండోపతండములుగ మూగుచుండిరి.

తొమ్మిదిగంటలైనది. మేజస్ట్రేటుగారు కోర్టు గుమ్మము వద్ద చలనహేతు శకటమును దిగిరి. అంతయు నిశ్శబ్దము. న్యాయాధికారి తన యాసనమున సుఖాసీనుడాయెను. మొదటి ముద్దాయి భైరవుడు. భైరవుని బోనులోని కెక్కించిరి. పత్తేదార్క్రింది ప్రశ్నల వడుగుచుండెను.

మేజ : భైరవా! కల్యాణకటకమున రామసింగు మహాశయుని కుమార్తెను హత్యగావించినది నీవేనా?

భైర : నేనే.

మా : ఒకనాటి సాయంకాలమున నీవును, మరొకడును భువనమోహిని యింటికి పోవుచుండగా నేను మిమ్ము వెంబడించితిని. ఆనాటి రేయి నేను జ్యోతిష్కుని వేషమున వచ్చి సర్వమును మీరు మాట్లాడినది వింటిని. అపుడు 'మిత్రఘ్నా! మొన్న రేయి నీవు చేసిన హత్యావిషయమున' యంటివే. నీవా, మిత్రఘ్నుడా హత్యజేసినది.

భై : నేనే జేసితిని. వాడు నాకు సహాయము వచ్చెను. వానిపై మొగతాళి కట్టంటిని.

మా : నిజము జెప్పుము.

భై : నిజము జెప్పుచున్నాను. దైవసాక్షిగ నేనామెను హత్యగావించి తచ్చిరమును మీ కార్యాలయమున కంపితిని.

మా : సేవకా! జైలునందున్న రాముని టకు తీసుకొనిరమ్ము.

రాముడు వచ్చి న్యాయాధికారికిని, పత్తేదారునకును నమస్కరించి తలవాల్చుకు నిలునబడియెను.

మాధ : ఓయీ! ఈతడేనా నీకు నాడు శవపేటిక నిచ్చినది? నిజము జెప్పుము.

రాము : అయ్యా! ఈతడేనండి.

మేజ : రాముడూ! నిన్నిక వదలివేసితిని. భైరవా! నీకు రెండేండ్లు కఠినశిక్ష విధించితిని.

రెండవ ముద్దాయీ నరాంతకుడు—

మా : ఓయీ! నీ చరిత్రను నిజముగ జెప్పుము. కేశవుని నీవేనా జైలునుండి తప్పించినది?

నరాం : నేనే.

మాధ : దాదాజీని, యిందిరను దొంగిలించిన నాడు నీవును వారితో యుంటివా?

న : లేను. పాతాళగృహమును కాపుగాయుచుంటిని.

మా : మధుసూదనునిగృహము దోచిననాడు నీవు కలవా?

న : అయ్యా! ఆనాడునుగూడ నేను రాలేదు.

మేజ: అట్లైనచో నీవు మనఃపూర్వకముగ పశ్చాత్తాపుడ వైనచో నిన్ను వదలివేతును. మరల నెన్నడేని యిట్టి క్రూర కార్యముల జేసినట్లు విన్నచో నీ కురిశిక్ష తప్పదు. ఏమందువ

న : అయ్యా! మీ పాదములుబట్టి ప్రమాణము జేయుచున్నాను. ఈరోజు మొదలు నేను పాతాళగృహమున నడుగిడుటగాని, ఆ చోరులతో గలసిగాని యుండను, దైవసాక్షి.

మేజ : నరాంతకా! పొమ్ము. నీవు విడుదల చేయబడితివి. ఇకముందిట్టి క్రూరకార్యముల నెన్నడును జేయకుము.

న : చిత్తము.

మూడవ ముద్దాయీ మిత్రఘ్నుడు—

మాధ : నేను జ్యోతిష్కుని రూపమున వచ్చినపుడు నీవు పాతాళగృహమున నుంటివా ?

మి : ఆ. ఉంటిని.

మాధ : ఇందిరా, దాదాజీల చోరీలప్పుడు నీవునుగలవా?

మి : (మాటాడక యుండును)

మా : మాటాడవేమి ? నారాయణా ! లాటీనిటు తెమ్ము.

భై : నేనును గలను.

మా : మధుసూదనుని గృహము దోచునపుడు ? రామసింగు కూతురును హత్యజేసిననాడు ?

మి : ఆనాడు నుంటిని. ఆనాడు నుంటిని.

మా : నీవేమైన హత్యయందు పాల్గొంటివా ?

మి : లేదు.

మే : నీవును రెండేండ్లు కఠినశిక్ష ననుభవింపవలయును.

దుష్టబుద్ధిని మిగత యనుచరులను కోర్టువారు విచారణజేసి తగుశిక్షల విధించిరి.

* * * *

ఇపుడు చోరాగ్రేసర చక్రవర్తి కేశవరావు విషయమై తీర్పు—

మా : ఇందిరాపహరణ కారకుడవు నీవేనా ?

కే : పరిశోధకాగ్రణీ ! నా జీవితచరిత్ర నంతను మీకు తేటతెల్లము గావింతును. సావధానమనస్కులరై వినుడు :

" యిందిరను నేను చిన్ననాటినుండియు ప్రేమించియుంటిని. నన్నును యిందిర కొంతకాలమువరకు ప్రేమించెను. తరువాత నేను విద్య చాలించి యిందను దుర్వ్యాపారత్వమున, దుస్సహవాసముచే పాడైపోవుట యామె వినినది. అందుపై నన్ను వివాహమాడ నిచ్ఛ లేకపోయినది. నేనామె నెట్లయిన వివాహమాడ సంకల్పించితిని. ఆమె మనోవాంఛను తెలిసికొన గోరి జటదారి రూపమున వచ్చితిని.

ఒకనాడామె ప్రమదోద్యాన వనమున విహరించుచుండగా నేనేగి యామెను బలాత్కరించితిని. ఆమె కెవ్వన కేకవేయుటచే నేను విడిచిపోవలసివచ్చెను. తరువాత నేను నా యనుచరులతో యిందిరను, దాదాజీగారి యాస్తిని దొంగిలించితిని. యిందిర నెన్నివిధములనైన భయపెట్టితిని. కాని సాధ్యముకాలేదు. తరువాత దాదాజీనిగూడ తీసుకువచ్చితిమి. దాదాజీచే జెప్పించిన వినుననెడి యుద్దేశ్యముచే నాతనిని తీసుకువచ్చితిమి. అప్పటికిని సాధ్యము గాలేదు. చివరకు మాలతివచ్చి తగునేర్పాటు నే చేయుదునని జెప్పుటచే నేనామె నుడులనెల్ల విని మోసపోయితిని.

మధుసూదనుని గృహమున రక్షకభటులలో మొదటివానిని జంపినది నేను. తరువాత చంపుదునని మధుసూదనుని హడల గొట్టి వాని ధనాపహరణ గావించినది నేను. దాదాజీ గృహమున రక్షకభటులనిద్దరకు విషవాయుప్రయోగము గావించినది నేను. రామసింగు కూతురు హత్యోపదేశకారకుడను నేను అట్టి యీ క్రూరుడు—ఈ రాక్షసుడు—ఈ కటికమానసుడు—బ్రతికిన నేమి? చచ్చిననేమి? ఓ యిందిరా! నేను నీకు చేసిన యపకారముల నెల్ల మరచిపోయి నీ మనోనాథునితో గూడి సుఖించుము.

సభికులారా! పతివ్రతల మోహ మెంత పరిశుద్ధమైనది. ఇట్టి యుత్తమనారీ లలామలు హిందూ సుందరులందు దక్క నిక నెందు నుందురు. ఇందిరా! నీకు నే జేసిన యపచారమునకు క్షమింపుము. మామా! నిన్నొకపరి నా కటారిపాల్గావించ దలచితిని. క్షమించగోరుచున్నాను. క్షమింపబడుటకై నయునర్హుడను.

పత్తేదారుజీ! మిమ్ముల ననవసరముగ ననేక శ్రమల బెట్టితిని. నన్ను క్షమింప వేడుచున్నాను.

హా దైవమా! నన్నెందులకు నింకను బ్రతుకనిచ్చెదవు? ఇట్టి నీచు డున్న నేమి చచ్చిననేమి? ఓ పంచభూతములారా! నన్ను మీలో గలుపుకొనుడు. హా నన్ను మీ రేల ముట్టుదురు. ఈ తుచ్ఛశరీరమును తాకి మీరు సైతము మైలగాకుడు. హా విధీ! యీ క్రూరునకు తగిన శిక్ష యెద్దియని యూ నీ వాలోచించుచుంటివి. వీనికి కారాగారప్రవాసము గాదు. ద్వీపాంతరవాసశిక్షయా? చాలదు—ఉరియా? వలదు.

ఓ సభికులారా! యిదే నా కడసారి పలుకు. యిట్టి క్రూరకర్ముడను, హంతకుడను బ్రతికియుండిన ప్రయోజనము లేదు... లేదు... లేదు... ముమ్మాటికిని లేదు" అనుచు మొల నుండి రివాల్వరును తీసి, కంఠమునకు గురిచేసికొని 'ఢాం'మని యొకసారి ప్రేల్చెను. నిశ్శబ్దము - అతి భయంకరము - రక్త మయము. అంతలో నలజడి. కేశవరావు "హా! నారాయణా" యని నేల గూలెను.

మేనబావ యగుటచే యిందిర మిక్కిలి విచారించెను. దాదాజీ తన మేనల్లుడు—పిన్ననాటినుండియు మిగుల గారాబముతో పెంచిన మేనల్లుడు—చనిపోవుటచే పొరలి పొరలి వచ్చు దుఃఖము నాపుకొనలేక బావురని యేడ్చెను. కొంతవడికి దాదాజీ మనసు దిట్టపరచుకొని మాధవరావు, నారాయణులకడ సెలవు తీసికొని కల్యాణకటకమునకు యిందిరా, మాలతీ, కేశిసులతో సుఖముగా బోయెను.

## తుది పలుకు

ఇందిరా, దాదాజీలు మాలతీ కేశినులతో సహితముగా కల్యాణకటకమునకు వచ్చిరి. నిరాశచే బెంగగొనియున్న కల్యాణకటక ప్రజలు యిందిరా, దాదాజీల జూచినతోడనే యానందబాష్పముల రాల్చిరి.

దాదాజీ, యిందిర మనోవాంఛ నెరింగియున్నవాడగుటచే నామెను నారాయణరావునకిచ్చి వివాహముజేయ

నిశ్చయించి పెద్దలచే నొక శుభముహూర్తము పెట్టించి నారాయణరావు తండ్రియగు రాఘవశాస్త్రిగారికి లేఖవ్రాసెను. తన యనుంగు కూతురు సమానమగు మాలతికి గూడ యుక్త వయస్సు వచ్చియుండుటచే యామె మనోభీష్ట ప్రకారము రామనాథ్ న కిచ్చి పాణిగ్రహణము జేయ నిశ్చయించి విష్ణుమూర్తి గారికి నొక శుభలేఖ వ్రాసెను. ఇరుగుపొరుగువారికిని, చుట్టపక్కాలకును, స్నేహితుల కందరికిని శుభలేఖల నంపించెను.

ఆ ముహూర్తమునకే యిందిరా నారాయణులకును, మాలతీ రామనాథ్ లకును, మంత్రాన్వితముగ నతిశోభస్కరముగ దాదాజీ వివాహంబు జేసెను. కష్టములు గట్టెక్కి సుఖించు కాలము వచ్చినది ఈ దంపతద్వయము హాయిగ సౌఖ్యాంబుధిం దేలి మనోల్లాసముగ కాలము గడపుచుండిరి. కేశిని తన యావజ్జీవము యిందిరా నారాయణులచే పోషింపబడెను.

హంతకచక్రవర్తుల బట్టి దొరతనమువారి కప్పగించిన మాధవరావు దొరతనమువారిచేతను, ప్రజలచేతను మిక్కిలి సన్మానింపబడి హెచ్చువేతనముల బొంది సుఖముగా యుండెను. నారాయణరావునకు వెంటనే పోలీసు సర్కిల్ యుద్యోగము నిచ్చి బహూకరించిరి. రామనాథ్ సి. ఐ. డి. గా పనిజేసి మిగుల ఖ్యాతిగడించెను.

సంపూర్ణము.

---

రాజేశ్వరిప్రెస్, రాజమండ్రి.

# అందరూ చదవదగినవి

## అపూర్వ నవలా సాహిత్యం

—* శరత్ నవలలు *—

| | |
|---|---|
| శ్రీకాంత | 7-8 |
| పల్లెజీవనం | 2-0 |
| వాగ్దానం | 2-0 |
| చంద్రనాథ్ | 1-8 |
| దేవదాస్ | 1-8 |
| అరక్షణీయం | 1-4 |
| పరిణీత | 1-0 |
| స్వామి | 1-0 |
| అనుపమాదేవి | 1-0 |
| బిందుగారబ్బాయ్ | 1-0 |
| బడీబహన్ | -12 |
| సుమతి | -12 |
| సవిత | 4-0 |
| నళిని | -12 |

—* సాంఘిక నవలలు *—

| | |
|---|---|
| సుందరి | 2-8 |
| ఫాదరిండియా | 1-8 |
| మదర్ ఇండియా | 1-0 |
| హరిచరణుడు | 1-0 |
| భిక్షుకి | 1-0 |
| గరీబ్ | 1-0 |
| నాగమ్మ | 1-0 |
| నీలకంఠం కథలు | 1-0 |
| పరిత్యక్త | 1-8 |
| పేరుకోసం | 1-0 |
| ఉషాసుందరి | 1-0 |
| శోభారాణి | 1-0 |
| రైన్‌నదీతీరంలో | 1-0 |
| ప్రణయమందిరం | 1-0 |

ఆంధ్ర బుక్‌ట్రస్టు
డిటెక్టివ్ నవల్సు

| | |
|---|---|
| మూడురోజుల్లో | 0-9 |
| లేడీ సెక్రటరీ | 0-9 |
| నలుగురు దొంగలు | 0-9 |
| నిగూఢ రహస్యం | 0-9 |
| రెడ్ లెటర్ | 0-9 |
| ఏ. బి. సి. డి. మర్డర్స్ | 0-9 |
| దేవదాసు | 0-9 |
| స్త్రీ | 0-9 |
| ఒకే హత్య | 0-9 |

—* జీవిత చరిత్రలు *—

| | |
|---|---|
| స్వామివివేకానంద్ | 1-0 |
| రామకృష్ణ పరమహంస | 1-0 |
| బాపూజీ | 1-0 |
| ప్రధాని నెహ్రూ | 1-0 |
| నేతాజీబోసు | 1-0 |
| రవీంద్రనాథ్‌టాగూర్ | 1-0 |
| రాజేంద్రప్రసాద్ | 1-0 |
| సర్దార్ పటేల్ | 1-0 |

¼ సొమ్ము ముందుగా అడ్వాన్సు పంపాలి - పోష్టుఖర్చులు ప్రత్యేకం.

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్**

**సంస్కృతాంధ్ర బుక్‌డిపో (స్థా. 1882) రాజమండ్రి**



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B130 |
| పుస్తకం పేరు | వింత పెండ్లి |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | no |
| వెనుక అట్ట | no |
| మొత్తం పేజీలు | 103 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 1to2 |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |